# ఉన్నది - ఊహించేది

[ కథలు ]

రా వూ రి  భ ర ద్వా జ



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

# ఉన్నది - ఊహించేది

గడియారం మూడుగంటలు కొట్టింది. శంకరం వీధిలోకి చూశాడు. సరోజిని వస్తున్న జాడలేమీ కనిపించలేదు. 'ఆమె రాకుండా ఉంటే బాగుండు' ననుకొన్నాడు శంకరం. ఈ దిక్కుమాలిన లోకంలో అనుకొన్నవి అనుకొన్నట్లు జరిగిచావవు. ఈమాట నిజమేగానీ, ఇవ్వాళమట్టుకు శంకరం అనుకొన్నది కాస్తా జరిగింది. మూడున్నర అయినా సరోజిని రాలేదు. శంకరానికి చాలా తేలికిచ్చినట్లయింది. దాదాపు మూడు నెలలనుండీ అతను సరోజినితో ఉడ్డుకుడిచిపోతున్నాడు. ఆమెను వదిలించుకొందామని గట్టిగానే ప్రయత్నించాడు శంకరం. కానీ ఈ పప్పులేమీ సరోజినిదగ్గర ఉడకలేదు. అతను వదిలించుకొనేందుకు ప్రయత్నిస్తున్నకొద్దీ, కుమారి సరోజిని అతన్ని మరింత కరుచుకుపోసాగింది. రాను రాను సరోజిని అతని కొంక గుదిబండలాగైంది.

ఆమెవల్ల లాభాలసంగతి అట్లాఉంచు. అవన్నీ తనకేమీ సద్యఃఫలితాన్నివ్వలేదు. ఇచ్చినవాటితో ప్రస్తుతం తనకేమీ అవసరంలేదు. అవన్నీ ముక్కులో వెంట్రుక కొప్పులో కొచ్చినప్పటిమాట. ముందు తను బోలెడంత నష్టపోతున్నాడు. చదువు బొత్తిగా సాగటల్లేదు. స్నేహితులు వీధి వీధికీ ఈ శుభవార్తను ప్రసారంచేస్తున్నారు. ఒకటి రెండుసార్లు గోడలమీదగూడా తమ పేర్లు రాశారు. ఇంత అల్లరీ జరిగినతరువాత తను సరోజను పెళ్ళిచేసుకోక

పోతే, నానా అభాసుగానూ ఉంటుంది. చేసుకోవటానికైనా తనకేమీ అభ్యంతరం లేనిమాట నిజమే! సరోజినికి ఏమాత్రమో చక్కదనముంది. తనకంటే రెండుక్లాసులంటే-రెండే క్లాసులు తక్కువగా చదువుకొన్నది. ఈ క్షణాన రెండు చేతులా సంపాదిస్తున్న నాన్న ఉన్నాడు. అమ్మ ఉన్నది. భగవంతుడు మేలుచేస్తే ఒక అన్నగారుకూడా ఉన్నారు. కులగోత్రాల పట్టింపు తన కేమాత్రం లేదు. పోనీ అది చూదామన్నా-తన కులంవాళ్ళే! వీటన్నిటినీ మించి ఆవిడ తనను ప్రేమిస్తున్నది. పరీక్షకు నిలుస్తుందో లేదోగానీ, మాటలనుబట్టి చూస్తే తనను మినహా మరొక మొగవాణ్ణి పెండ్లాడనే పెండ్లాడ దనిపిస్తుంది.

అయినా శంకరానికి సరోజను పెండ్లాడబుద్ధెయ్యలేదు. లోకు లేమనుకుంటారోనన్న భయంగూడా లేకుండా, పాటికి పదిసార్లు తన గదిచుట్టూ తిరిగే సరోజను తలుచుకున్నప్పుడల్లా, శంకరానికి ఆవిడమీద జాలివేసేది. ఒకటి రెండుసార్లు స్వగతంగా విచారం ప్రకటించాడు. ఆమెను వీలయినంత మేరకు తనకు దూరంగా ఉంచాలని చూశాడు. సరోజిని ఈ ప్రయత్నం పసికట్టింది. అతని ఆటలేమీ సాగనివ్వలేదు. తన ప్రయత్నమూ మానలేదు. ఏనాడో ఒకనాడు శంకరం తనను చేసుకోకపోడని ఆవిడ నమ్మింది. ఈ నమ్మకానికి గల ఆధారా లేమిటో ఆవి డెక్కడా బైట పెట్టలేదు.

గడియారం నాలుగుకొట్టింది. సరోజినిరానేవచ్చింది. అయితే ఈసారి ఒక్కర్తే రాలేదు. ఆమెవెంట తండ్రికూడా

తెచ్చుకొంది. కొత్తమనిషిని చూచి శంకరం తగుమాత్రం గాభరాపడ్డాడు. 'మరేమీ ఫరవాలే'దని సరోజిని హామీ ఇచ్చిందాకా అతను స్థిరపడలేదు.

"వీరే నాన్నా, శంకరంగారు. ఎవరూ? ఇందాక నీతో చెప్పలా... ..." అన్నది సరోజిని తండ్రిని శంకరానికి పరిచయంచేస్తూ.

"అదేలే..."అన్నాడుసీతాపతిగారు.ఆయనగారుశంకరాన్ని తదేకంగా పరిశీలించారు. కుశలప్రశ్నలు వేశారు. ఎక్కడెక్కడ బంధువు లున్నదీ అడిగాడు. తనకెవరు బంధువులో, వాళ్ళల్లో బాజెమ్మ లెవరో మంచివాళ్ళెవరో, ఎంత మందికి తను చిన్నతనంలో చదువూ గట్రా చెప్పించాడో, వాళ్ళల్లో ఎవరెవరు తన్నెయేవిధంగా చూస్తున్నారో వైనవైనాలుగా చెప్పాడు సీతాపతి. అంతసేపూ ఆయనకళ్లుశంకరాన్ని వెదుకుతూనే ఉన్నాయి. ఆ పద్ధతి చూస్తుంటే శంకరానికి చిరాకేసింది. ముఖాలు చదివి ఉద్దేశ్యాలు తెలుసుకొనే సీతాపతి తన ప్రసంగం ఆపి, శంకరాన్నిగురించి ఎత్తుకొన్నాడు. తద్వారా ఆయన కొంత సమాచారం సేకరించుకోవాలి. సరోజమాటలమీద ఆయనకు నమ్మకంలేక కాదుగానీ, పిచ్చికుంక – గోరంతను గంపంతలు చేసిందేమోమరి!

శంకరం అన్నిసంగతులూ దాచకుండా చెప్పేశాడు. ఆయన అడుగుతున్న దెందుకో శంకరానికి తెలియకపోలేదు. తెలిసీ తను ఉన్నదేమిటో చెప్పాడు. తల్లిదండ్రులు లేరన్నాడు. మేనమామ చదువుచెప్పిస్తున్నా డన్నాడు.

"అయితే దానివల్ల ఆయనకేమీ లాభించదు కూతురునిచ్చుకోటానికిగూడ లేదు. ఆయన అయిదుగురు పిల్లల్లోనూ, ముగ్గురు మొగపిల్లలు. ఇద్దరు ఆడపిల్లలూ చిన్న వాళ్ళు. తనకున్న ఒక్కగానొక్క చెల్లెలికోడుకునని నాకు చదువు చెప్పిస్తున్నాడు." అన్నాడు శంకరం.

సీతాపతిగారికున్న ఒక్కో సందేహమూ పటాపంచ లయింది. ఆయన లేచి, పై పంచ విదిలించి భుజాన వేసు కొని, చెప్పులుతొడుక్కొని, 'వెళ్లొస్తా' నని శంకరంతో చెప్పి, బైటికి అడుగుపెట్టాడు.

'నేను ఫస్టుషోకి వెళ్ళొస్తాను నాన్నా!' అన్నది సరోజిని వాకిటిదాకా వెళ్ళి.

"ఒక్కర్తవేనా?" అన్నాడు సీతాపతి.

"నా కేమీ భయంలేదు."

"పోనీ, శంకరంగారు నిన్ను యింటిదాకా దిగబెడ తారేమో కనుక్కో. అన్నట్టు ఆయనగార్ని రాత్రికి మనిం టికి రమ్మను అక్కడే భోంచేస్తారు."

శంకరం ఏదో చెప్పబోయాడు. అప్పటికే సీతాపతి పది గజాలదూరం వెళ్ళాడు. రానని బిగ్గరగా కేకవేయటా టానికి శంకరంమనస్సు ఒప్పుకోలేదు. బరువుగా కుర్చీలో చతికిలబడి-"ఇదంతా ఏమి" టని సరోజను అడిగాడు.

"ఏముందీ?" అన్నది సరోజ నవ్వి.

"నీ పద్ధతి చూస్తుంటే నాకు చాలా భయమేస్తు న్నది. నువ్వెందు కింత సాహసించావో తెలియటంలేదు" అన్నాడు శంకరం.

"నేనుత్త పిరికిదాన్నని మావాళ్ళందరూ అంటుంటారు. నేనూ నిజమేమో ననుకొన్నాను. ఏ మాత్రం ధైర్యమున్నా—మా నాన్న—ఎప్పుడో ఇక్కడి కొచ్చేవాడు. ఇంత ఆలస్యం అయ్యేదే కాదు; మరి నాలో మీకు సాహసం ఎట్లా కనిపించిందో నాకూ తెలియటల్లేదు" అన్నది సరోజ. తను చాలా తెలివిగా తప్పుకొన్నానని సరోజ లోపల సంతోషించింది. అయితే ఆ సంతోషం శంకరం ఎక్కువ సేపు దక్కనివ్వలేదు.

"నువ్వు మీ నాన్న నెందుకు తెచ్చిందీ నాకు తెలుసు. అయినా నువ్వీ పాడుపని ఎందుకు చేశావా అని!"

"ఇది పాడుపనా!" అన్నది సరోజిని.

"నామట్టుకు నాకు పాడుపనిగానే ఉంది. నీను వో లింగయ్యను ప్రేమించావు. వాణ్ణి తప్ప ఇంకోణ్ణి చేసుకోనని హఠంచేశావు. ఆ లింగాయ కమామిషేమిటో తెలుసుకోనేందుకు మీ నాన్న వచ్చాడు. మీ నాన్నగ్గూడా ఆ లింగాయ నచ్చినట్లు గానే వుంది. బావుంది. అయితే ఆ లింగాయకు నిన్ను చేసుకోవాలని ఉన్నదో లేదో నువ్వు ఆలోచించ లేదు. మీ నాన్న అంతకన్నా ఆలోచించలేదు. మీరిద్దరూ కలిసి ఆ లింగాయకు ఉరిదెస్తున్నారు" అన్నాడు శంకరం విసుగ్గా.

సరోజముఖం మాడిపోయింది. తన మాటలు చాలా ఘాటుగా తగిలాయని తెలుసుకొన్నాడు. అందులో అవసరాన్ని మించిన ఘాటు తను ఉపయోగించాడు. రవంత పాలు తగ్గించినట్లయితే బాగుండేది.

"నన్ను పెళ్ళాడ్డం నీకు యిష్టంలేదా శంకరం?" అన్నది సరోజ తెగబడి.

"ఇష్టంలేదని చెప్పడానికి భయంగా ఉంది."

"ఎందుకు? చెబితే యిక్కడెవరూ నిన్ను కొరత వేసేవారు లేరే!"

"అవసరమొస్తే కొరతవేసేవారున్నా - చెప్పదలచిందేమిటో చెబుతాను...... ఇష్టంలేదని నేను చెప్పగానే నువ్వూరుకోవు. ఎందుకు యిష్టంలేదో నువ్వడుగుతావు. ఆ ప్రశ్నకు చాలా పెద్ద సమాధానం యివ్వవలసి ఉంటుంది. నీలో ఫలానా లోపం ఉన్నదని నే నను. ఆ మాటకొస్తే లోపమంటూ లేనిది ప్రపంచంలో ఏముందీ?"

"మరి నువ్వెందుకు కాదంటున్నావో చెప్పవేం?"

"నన్ను చెప్పనివ్వం దేనా?" అన్నాడు శంకరం. సరోజ ఏమీ మాట్లాడలేదు.

"నేను నిన్నిప్పుడు కాదంటే నువ్వేమవుతావో ఆలోచించావా? నే నంతదూరం జరిగినా, నువ్వు నన్నంటిపెట్టుకొని ఉంటున్నప్పు మనిద్దరం దొంగచాటుగా దాంపత్యం వెలగబెడుతున్నామని కాలేజీ మొత్తానికి తెలిసింది."

"నువ్వు ధైర్యంచేస్తే భయపడటానికేమీ ఉండదు. అనుకోనివ్వు. మనకేం? ఇదివరకు కాకపోతే, రేపు మనం వెలగబెట్టకుండా మానుకోవటల్లేదు గదా!" అన్నది సరోజిని.

"మానుకుంటున్నామనే నే ననుకొంటున్నాను."

సరోజ దిమ్మరపోయింది.

"నువ్వెవరినన్నా ప్రేమిస్తున్నావా శంకరం?" అన్నది కాసేపు తాళి.

శంకరం నవ్వాడు.

"లేదు. ఎవరినన్నా ప్రేమించటమే జరిగితే, ముందు నీ విషయమే ఆలోచిస్తాను సరోజా. అయితే అది జరగదనే నా నమ్మకం. ఎందుకంటే - నాకు ప్రేమలో బొత్తిగా నమ్మకం లేదు."

"లేదా?" అన్నది సరోజ కనుబొమలు పైకిలాగి ఆశ్చర్యంగా,

"నీకు చిత్రంగా ఉంది కదూ యీమాట? నాకుమట్టుకు లేదు. అదొకరకమైన జబ్బు. అది సోకినవానికి ఏ మందూ సరిగ్గా పనిచెయ్యదు. కాలంకలసివచ్చి కుదిరిందా సరేసరి, లేదా వాడా రోగంతోనే ఆవలించి చస్తాడు. నేను బోలెడుమందిని చూశాను. అందులో ఏ వొకరిద్దరో తప్పిస్తే మిగతావారందరికీ యీ జబ్బే ఉన్నది. లక్షరోగాలకు పది లక్షలరకాలమందులు కనిపెడుతున్నారు. రోగానికి మందు కనిపెడుతున్నట్లు నా కెక్కడా దాఖలా లేదు." అన్నాడు శంకరం.

సరోజినికి శంకరాన్ని చూస్తే భయమేసింది.

"నన్నడిగితే ప్రతివాడికీ ప్రేమించే హక్కు ఉండకూడదంటాను. మనిషిదగ్గర డబ్బునుబట్టి, వాడికి ప్రేమించే యోగ్యతలు పెరుగుతుంటాయి మా ఊళ్ళో ఇద్దరు కలిసి, వొకే రోజున, వొకేచోట, వొకేసారి తెరమీది స్టారును ప్రేమించారు. ఆ స్టారు, ఉన్న అవయవాలన్నీ అవకాశ

మున్నంతవరకూ ప్రేక్షకులను చూడనిచ్చింది. ఇద్దరూ ఆవిణ్ణి ప్రేమించారు. ఏం జరిగింది? బాగా డబ్బున్న మొదటి వాడు పాతికెకరాల పొలమూ తెగనమ్మి ఆ స్టారును మూడు నెల్లు ప్రేమించాడు. ఆ రెండో వెధవ యిప్పటికీ గుటకలు మింగుతూనే ఉన్నాడు. కాబట్టి దరిద్రుడికి అన్ని హక్కులతోపాటు ప్రేమించేహక్కుకూడా లేదని నా నమ్మకం."
అన్నాడు శంకరం.

"ముష్టి డబ్బుకూ, పవిత్ర ప్రేమకూ సాపత్యమేమిటి శంకరం! ప్రేమ ఎన్ని త్యాగాలు చేయిస్తుంది! అదే గనక లేకపోతే ఈ ప్రపంచం......"

శంకరం ఫక్కున నవ్వాడు.

"ఏదో అయిపోతుందంటావు కదూ? ఏమీ కాదు. నీ ధోరణి చూస్తుంటే నువ్వు ప్రేమసాహిత్యం బట్టీబెట్టి నట్టుంది. 'చలం'గారి పుస్తకాలన్నీ చదివావా?"

సరోజిని మాట్లాడలేదు.

"ఆ గొడవ వదిలెయ్—డబ్బు ముష్టిదని నువ్వెట్లా అన్నావో గానీ, నేనుమాత్రం అనను. డబ్బుమీద నాకు నిర్లక్ష్యం ఎప్పుడూ లేదు. అది నా కళ్ళకు మహాశక్తిలాగా కనిపిస్తుంది. దాన్ని సంపాదించటంకంటే ప్రపంచంలో సాధించవలసిన ఘనకార్య మేమీ నాకు కనిపించడంలేదు."

శంకరం ఈ మాట అనీ అనకముందే, సరోజినికి అంతా అర్థమయినట్లనిపించింది. ఈ కాస్తమాట వెళ్ళబెట్ట డానికి ఇన్ని డొంకతిరుగుళ్ళెందుకో సరోజినికి తెలియలేదు, తన తండ్రిమాత్రం యిప్పుడు కాదంటున్న దేమున్నదీ?

ఒకరి కిచ్చే కట్నం శంకరానికీ యిస్తాడు. నిజం మాట్లాడితే, తను దెబ్బలాడి మరో రెండు వేలు ఎక్కువగానేముట్టజెప్పించ గలుగును. ఈ ముత్తెమంత దానికి యింత రభసచెయ్యాలా? సరోజ 'ఆ భయమేమీా అక్కర్లే'దని శంకరానికి చెప్పింది.

"నే నా ఉద్దేశంతో అనలే"దని శంకరం చాలాసేపు వాదించాడు. సరోజినికి చిరాకేసింది. శంకరం వాదిస్తున్న పద్ధతి ఆవిడకు ఎబ్బెట్టుగా ఉంది. అసలు సంగతేమిటో తేల్చు కుందామని, ఉన్న సందేహాలేమిటో బైటపెట్టమని నిగ్గ దీసింది.

"నిన్ను చేసుకోవటానికి నాకే అభ్యంతరమూ లేదు. నామీాద వ్యాపారం చెయ్యాలని మా మామయ్యకంత కన్నా లేదు. అయితే నువ్వు నన్ను ప్రేమించానంటున్నావు. అందులో నాకు చీమతలకాయంతైనా నమ్మకం లేదు. ఈ గొడవేమీా లేకుండా సరాసరి మీా నాన్నగారే నా దగ్గర కొచ్చి 'మా అమ్మాయిని చేసుకో' మంటే నిక్షేపంగా చేసు కొనేవాణ్ణి."

'అదేమిటీ?' అన్నది సరోజిని అర్థంకాక. 'చెబు తాను. ప్రేమ కేవలం భ్రమలాంటిది. కొన్నికొన్ని పరిస్థి తుల్లో అట్లాంటి భ్రమలు పుడుతుంటాయి. ఆ పరిస్థితులు పోగానే, ఆ భ్రమలూ పోతాయి. కల నిద్రలోనే వస్తుంది గానీ, మెలకువలో రాదుగదా! మేలుకునిఉండే కలలుకనే వాళ్ళు లేరా అంటావు. ఉన్నారు. అయితే వాళ్లుమేలుకొని ఉన్నా నిద్రపోతున్నవాళ్ళలోనే జమ."

"ఒకరికొకరు యిష్టమయి, పెళ్ళిచేసుకొని, సుఖంగా ఉంటున్నవారు బోలెడుమంది ఉన్నారు" అన్నది సరోజిని.

"అక్కడే నువ్వు పొరబడుతున్నావు. దాన్ని నేను 'అలవాటు' అంటాను. నువ్వు నే నన్నమాట సరిగ్గా అర్థం చేసుకోలేదు సరోజా! నువ్వేదో నిద్రలోఉండి నన్ను చేసుకోవాలనుకొన్నావు. మేలుకుంటే నిద్రలోఉన్నంత సుఖంగా నేనుండకపోవచ్చు. అప్పుడు నువ్వు విచారించవలసివస్తుంది. నీ క్షేమంకోరి నేను చెబుతున్నానుగానీ, నాకోసం గాదు. వీటన్నింటికి సిద్ధపడతానంటావా? నేనూ సంతోషిస్తాను. నీ లాంటి అందగత్తెతో సుఖపడటమంటే నాకు నిషేధమేమీ లేదు." అన్నాడు శంకరం. సరోజిని దీర్ఘంగా నిశ్వసించింది. ఆమెకళ్ళు మెరిశాయి. శంకరమన్న చివరిమాటకు ఆమె సిగ్గుపడ్డది. గడియారం ఆరుగంటలు కొట్టింది. శంకరం చప్పున వీధిలోకెళ్ళి రత్నాటాకీసు కొక గుర్రబ్బండి కుదిర్చాడు.

ఆట చిన్నదికావటంచేత సరోజిని, శంకరం పెందలాడే యింటికొచ్చారు. భోజనానికి రాడేమోనని సరోజిని భయపడింది. రానంటే తనేవిధంగా అతన్ని రప్పించాలో ఒకటికి రెండుసార్లు రిహార్సలు చేసుకొంది. కానీ యివన్నీ జాస్తిగా అనవసరమైపోయినవి. శంకరం సరాసరి సరోజిని యింటికే బండి మాట్లాడాడు. 'ఇప్పటి కొక పెద్దగండం గడిచినట్లు సరోజ భావించింది.

సీతాపతి, శంకరం భోంచేశారు. రాజమ్మగారే వడ్డించింది. అసలు తనే వడ్డిస్తానని సరోజిని అన్నది గానీ,

రాజమ్మగారే ఆ ఆలోచన పడనియ్యలేదు. వాళ్ళిద్దరూ భోంచేసి వసారాలో కెళ్ళారు. సరోజిని ఆకులు, వక్కల డబ్బీ అక్కడపెట్టి లోపలికొచ్చింది. అప్పటికప్పుడే సత్యమూ, రాజమ్మా మీటింగుచేశారు. సరోజగూడా ఆ మీటింగులో పాలు పంచుకోంది. తేలిన సారాంశ మేమిటంటే రాజమ్మకు శంకరం నచ్చలేదు. ఆ విషయమే ఆవిడ బైట పెట్టింది. సరోజిని ధరుశిన మండిపడ్డది.

"నువ్వీకాలపుదానివి కావు. ఈ కాలపు వ్యవహారాలు నీకేమీ తెలియవు. నువ్వు గమ్మున నోరుమూసుకొని కూచో. అంతే గానీ- అవసరమున్నా లేకపోయినా నీ అభిప్రాయాలు మా అందరినెత్తిమీద రుద్దకు" అన్నది సరోజ దాదాపు కథలోని నాయికలాగా.

"నాకు తోచించేదో నేను చెప్పాను. ఇంతమాత్రానికే అంతమాట లంటావుటే నువ్వు! అయినా నువ్వీమధ్య మరీ తెగించిపోయావే సరోజమ్మా!" అన్నది రాజమ్మ.

సత్యంగూడా చెల్లెలినే సపోర్టుచేశాడు. అది చాలా అవసరం. రేపు సరోజ తనను ఆదుకోనవలసిన సమయం రావొచ్చు. ఇప్పుడు దీనికి తగుమాత్రం మాటసాయం చేయటం ఎంతైనా మంచిది.

"నువ్వూరుకోవే అమ్మా! సరోజ చిన్నదీ చితకదీ కాదు. మంచిచెడ్డలేమిటో దానికీ తెలుసు. అయినా దాని పెళ్లిగొడవతో మనకెందుకు చెప్పు? అ దెవణ్ణో "లవ్" చేసింది. వాడూ తలెగరేశాడు. వాళ్లిద్దరికి ముడిబెట్టేస్తే తీరిపోతుంది." అన్నాడు సత్యం.

"అదో దౌర్భాగ్యుణ్ణి చేసుకుంటానంటే మనమొప్పుకుంటామ్రటా సత్యం?" అన్నది రాజమ్మ.

"దౌర్భాగ్యుణ్ని అదిమాత్రం ఎందుకు చేసుకుంటానంటుందీ?" అన్నాడు సత్యం చెల్లెలివేపు చూసి.

"ఇప్పుడు చేసుకోంటా నంటున్నవాడు అంతకంటే ఘనుడ్రటా?"

సరోజిని కోపం తారకస్థాయి నందుకొన్నది. తన శంకరం దౌర్భాగ్యుడా? ఏంచూసి దౌర్భాగ్యుడని నిర్ణయించింది? ఇతనికోసం ఎంతమంది కాచుక్కూచున్నారో ఈవిడకేం తెలుసూ? తను ఏమాత్రం యేమరినా ఆ జానకి కాస్తా ఎప్పుడో గుటుక్కున మింగేసేది శంకరాన్ని. ఇట్లాంటి మంచివాళ్ళు మొగుళ్ళుగా అందరికీ దొరుకుతారా? బోలెడుమంది పోటీలమీద పోటీలుపడి చస్తుంటే తనొక్కర్తే మహా జాగ్రత్తగా శంకరాన్ని వలలోవేసుకొన్నదే! రేపు ఈ విషయం తెలిసి అధమం అరడజనుమంది అమ్మాయిలయినా గుండెఆగి చావటానికి సిద్ధంగా ఉన్నారే! అట్లాంటి శంకరం దౌర్భాగ్యుడల్లే కనిపించటమేమిటి?' అనకూడదు గానీ కామెర్లరోగికి ప్రపంచమంతా పచ్చగా కనుపిస్తుందట!

సరోజిని ఊరుకోవటం సత్యం గమనించాడు. తను సరోజ కోపుకాయటానికి యింతకంటే మంచి ఛాన్సు దొరకదు. అంతా ఛిద్రమైపోయిన వ్యవహారం. కేవలం తన ప్రయోజకత్వం వల్లనే కుదుటపడ్డదని రేపు సరోజతో తను చెప్పుకోవచ్చు. దూరదృష్టిగల సత్యం రాజమ్మగారి ఏకైక

సుపుత్రిరత్నం. తల్లిమాటను కాదుకూడదని ఖండించిపారే శాడు.

"అమ్మా! నీతో అనకూడదుగానీ సరోజ మంచిపనే చేసిందే! ఎవడో ఇష్టంలేనివాణ్ణి చేసుకోకుండా, తనకు కావలసినవాణ్ణి తనే వెదుక్కుంది. తప్పేముంది? సరోజ అతి గాణ్ణి ప్రేమించింది. ప్రేమంటే ఏమిటో నీకు చెప్పలేనుగానీ, అది భలే మంచిది. దాన్నెట్లా చెప్పాలో నాకూ తెలియ టంలేదు. లోకంలో చాలాచోట్ల ప్రేమవివాహాలు జరగవు. అట్లా జరగటానికి చాలాచాలా, ఏమేమిటో కావాలి. మన చెల్లెమ్మ అవన్నీ—దీనిదుంపతెగ! ఎట్లాసాధించిందో సాధిం చింది. అందుకు నువ్వు సంతోషించటం పోయి విచారిస్తా వెందుకే అమ్మా?" అన్నాడు పుత్రిరత్నం.

రాజమ్మకిదేమీ నచ్చలేదు.

"చూస్తూ చూస్తూ వో బజారునపోయేవాడికి కన్న బిడ్డనెట్లా యిచ్చుకోనేదిరా సత్తెం? నువ్వూ అట్లాగే అంటావు!"

సత్యం ఏదో అనబోతున్నాడు. ఇంతలోకే సీతాపతి గారే లోపలికొచ్చాడు. సరోజిని శంకరంకోసం కళ్లుతిప్పింది. అక్కడ శంకరంలేడు.

"తనకోసం ఎవరో వస్తారట. వెడతానన్నాడు. ఇప్పుడే పంపి వస్తున్నాను. ఉదయం కాఫీకి రమ్మన్నాను. ఒసేవ్! కొంచెం పెందరాడే లేచి ఆ వ్యవహార మేమిటో చూడు" అన్నాడు సీతాపతి.

"ఇం కెందుకూ చూడటం? శంకరానికి కాఫీ యివ్వటం కూడా దండగే! అతని కోసం ఖర్చుపెట్టే కాఫీ-మన కింకో పూట వొస్తుంది" అన్నది సరోజిని విరక్తిగా.

"అదేమిటే!" అన్నాడు సీతాపతి దిమ్మరపోయి నట్టయి.

"అమ్మాకు శంకరాన్ని చేసుకోవటం అమ్మకు యిష్టం లేదట నాన్నా!" అన్నాడు సత్యం.

సీతాపతి భార్యవేపు మింగేట్టు చూశాడు.

"ఇదేమిటే నీయమ్మకడుపు కాలిపోను! మరీ నీ కిట్లాంటి పాడుబుద్ధులు పుడుతున్నయ్యేం? రవ్వచెక్కలాంటి కుర్రాడు దొరికితే బాగుండలేదన్నావంటేం? నీ కేం పుండు పుట్టిందే? అతగాడు ఇవ్వాళ సరేనంటే-ఎంత హీనంగా చూసుకొన్నా పాతికవేలు కట్నమిస్తారు. చిల్లి దమ్మిడీ తీసుకోకుండా పెండ్లాడేస్తానని అనటమే చాలునే! పాతిక కాదు-యాభై వేలిస్తేమట్టుకు అట్లాంటివాడు నీకు దొరుకుతాడుటే! నువ్విక్కడ కూచుని దాని మనసు విరిచేస్తున్నావా? ఎవడు చెప్పాడే నీ కీ బుద్ధి?" ఈ పద్ధతిగా సీతాపతి చాలా దూరం వెళ్లాడు.

సరోజమ్మకు ఎక్కడలేని ఆనందం పుట్టుకొచ్చింది. సత్యంగూడ తన హర్షం ప్రకటించాడు.

"అదిగూడా కాదు నాన్నా! డబ్బు సంగతి అట్లా ఉంచు. ముందు సరోజకు-ఆ చేసుకోబొయ్యేవాడు నచ్చాలిగదా? నువ్వు లక్షరూపాయలిచ్చి కొనుకొచ్చినవాడు అమ్మడుకు నచ్చుతాడనే గ్యారంటీ యేముంది? శంకరాన్ని సరో

జిని ప్రేమించింది. వాణ్ని తప్ప మరొకణ్ని చేసుకోమనటం ఛండాలం. శంకరానికేం తీపరమొచ్చింది! లక్షణంగా బి. కాం. ప్యాసయినాడు. ఏ కొట్లో కూచుని పద్దులు రాసుకొన్నా సరిపోతుంది. అమ్మమాటలకేంగానీ, నువ్వీ మ్యారేజి సెటిల్ చెయ్యి నాన్నా!" అన్నాడు సత్యం.

"సెటిల్ చెయ్యక ఊరుకొంటాననుటా? అనవసరంగా యిది నోరుపారేసుకొంటుందిగానీ."

రాజమ్మ ఏమీ మాట్లాడలేదు. ఏం మాట్లాడుతుందీ? మాట్లాడినా వినుపించుకొనే దెవరు?

# 3

పెళ్ళయిపోయింది. పెళ్ళిలోనే కార్యంగూడా అయి పోయింది. సరోజిని పెండ్లికి తన ఫ్రెండ్సునందర్నీ పిలిచింది. తను ఎటువంటి మొగుణ్ణి సంపాదించుకొన్నదీ వాళ్ళందరూ చూడాలని ఆవిడ అభిప్రాయం. దాదాపు అందరూ వచ్చారు. సరోజ ఊహించినట్లు ఎవ్వరూ గుండె ఆగి చావ లేదు. ఒకరకంగా అది సరోజకు బాధగానే ఉంది. తనను చూసి కనీసం నలుగురైనా అసూయపడినట్లయితే, ఆవిడ కే విచారమూ కలక్కపోను. మరి భగవంతుడు ఆమె కా యోగ్యత లేకుండా చేశాడు. ఒకరి ననవలసిన పనేమున్నది? సరోజిని ప్రస్తుతం భూమిమీద లేదు. ఉన్నా అదిభూమికిమల్లే సరోజినికి కనిపించటంలేదు. అదేంకర్మమో ఆమెకు ప్రతి దాంట్లోనూ ఆనందం పొర్లిపోతున్నట్లు తోచేది. గాలివీస్తే,

ఎండకాస్తే, మబ్బువేస్తే, పిచ్చుక అరిస్తే కొత్త. శంకరం కొంతసేపు దేవుడికిమల్లేనూ, యింకొంచెంసేపు దేవాదిదేవు డికి మల్లేనూ సరోజమ్మకు కనిపించేవాడు. ఒక్క నిమిషం ఆలస్యమయితే సరోజమ్మ ప్రాణం విలవిలలాడిపోతుంది. అందుకని ఎప్పుడూ శంకరాన్ని వదిలేదిగాదు. శంకరంగూడా గడుసువాడే! ఇద్దరూ ఆ మేడ దిగి కిందికి వచ్చేవారేగాదు. అదిచూచి నలుగురూ నాలుగురకాల అనుకొన్నారు. అను కొన్నారనిగూడా సరోజకు తెలుసు. తెలిసిగూడా ఆవిడ లక్ష్యపెట్టలేదు. ఇన్నిటికీ మన్మథుడు—దిక్కుమాలిన వెధవ —మహా గడుసుపిండం.



తీపి రుచిగానే ఉంటుంది. ఉంటుందిగదా అని అదే పనిగా మెక్కితే ఏంచేస్తుంది? ముందు మొఖం మొత్తుతుంది. మొత్తినా తింటే జబ్బుచేస్తుంది. ఈ జబ్బుకు విరుగుడు, ముందు తీపి తినటం మానెయ్యాలి. అవసరమయితే, కారం గూడా తినాలి. అది అందరూ ఒప్పుకుంటారు. అంతమాత్రం చేత యీ సిద్ధాంతాన్ని మనుష్యులకు అప్లయ్ చేయుడానికి వీల్లేదు. దురదృష్టవశాత్తూ మన సంఘంలో ఆ పప్పులేమీ ఉడకటల్లేదు. ఉడికించాలని ప్రయత్నించేవాళ్లు లేకనూ పోలేదు.

సరిగ్గా సరోజమ్మస్థితి ఇల్లాగేఅయింది. ఆమె ఇప్పుడు తరుచుగా కిందనే ఉంటున్నది. ఎప్పుడోగానీ పైకిపోదు. పోయినా వెంటనే క్రిందికొస్తున్నది. అనేకసార్లు ఆవిడ తల్లి దగ్గరే పడుకొంటున్నది. ఎందుకు పడుకొంటున్నదో రాజ

మ్మగూడా కూతుర్ని అడగలేదు. ఎందుకడుగుతుంది? తను మాత్రం అట్లా పడుకోలేదా మరి?

సరోజలో వచ్చిన మార్పు శంకరంలోగూడా వచ్చి నట్లయితే అనుకోవటాని కేమీ ఉండేదిగాదు. కానీ శంకరం మారలేదు. అతను ఈనాటికీ క్రిందికి రావటంలేదు. ఇదివరకు రోజుల్లో సరోజినే పైకి పట్టుకెళ్ళేది భోజనం. ఇప్పుడుగూడా పట్టుకెడుతూనేఉంది. అయితే యిదంతా ఆమెకు అనవ రంగా కనిపించింది. ఆ మేడమీద వెలగబెట్టే రాచకార్యా లేమీ లేవామె! పోనీ భోజనానికన్నా కిందికి రాగూడదూ? ఉదయమూ, సాయంత్రమూ కాఫీకి, అన్నానికీ, యిన్నిసార్లు ఎక్కి దిగటమెందుకు? ఈ ఆలోచన వచ్చినరోజునే సరోజ దానిని ఆచరణలో పెట్టింది. మామూలుగా పదకొండింటికి పైకి భోజనం పట్టుకెళ్ళేది కాస్తా, ఆనాడు పన్నెండయినా ఆ ప్రసక్తే తీసుకురాలేదు. ఈ నిమిషమో మరునిమిషమో, శంకరం కిందికి వస్తాడని సరోజ ఎదురుచూసింది. అతను రానేలేదు. గడియారం నాలుగుగంటలు కొట్టింది. అంటే సాయంత్రం కాఫీవేళన్నమాట. సరోజినికి ఎక్కడలేనిచిరా కువేసింది. అతనికి ఆకలే లేదా? ఉన్నా దాన్ని చంపుకొ న్నాడా? అట్లా పేగులు ముడుచుకొని పడుకోకపోతే కిందికి దిగి రాగూడదూ? ఒస్తే తన గౌరవాని కేమీ భంగంరాదే!

కాసిని పకోడీలు, పింగాణీకప్పులో కాఫీ, మంచినీళ్ళ గ్లాసూ పుచ్చుకుని సరోజిని మేడమీది కొచ్చింది. గదిత లుపు దగ్గరగా వేసిఉంది. కాలితో నెట్టి లోపలికొచ్చింది. శంకరం నిశ్చింతగా నిద్రపోతున్నాడు. సరోజినికి ఆశ్చర్య

మేసింది. తను వెళ్ళేసరికి, గదిలో కాలుకాలిన పిల్లిలాగా, మేతకోసం ఎదురుచూస్తూ, అటూ యిటూ శంకరం తిరుగుతుంటాడని ఆమె ఊహించింది. అదేమీ లేకుండా అతగాడు నిద్రకుపడ్డాడు. పొద్దుట్నుంచీ అన్నం తినకుండా ఉంటే శంకరానికి నిద్ర ఎట్లాపట్టిందో సరోజినికి అర్థంకాలేదు.

"లేవండి, కాఫీ తాగుదురుగాని" అన్నది సరోజ.

శంకరం లేచాడు.

"ఇదిగో టిఫిన్..." అన్నది సరోజిని పళ్ళెం ముందుకు నెడుతూ.

శంకరం ఆవలించి, వొళ్ళు విరుచుకొని, చొక్కాతో కళ్ళు తుడుచుకొన్నాడు

"మీరు తొందరగా తాగండి కాఫీ. నేను తెచ్చేటప్పుడే చల్లగా ఉన్నాయి."

"ఏమిటి?" అన్నాడు శంకరం.

"నువ్వేమీ తీసుకురావేమో ననుకొన్నాను. మంచి దానివే! టిఫినూ, కాఫీగూడా తెచ్చావు. నేనే నిన్ను గురించి పొరపాటు అంచనా వేసుకొన్నానన్నమాట" అన్నాడు శంకరం నవ్వి.

సరోజిని కది నవ్వేకుమల్లే లేదు.

"బాగానే ఉంది మేళం! తీసుకురానని ఎందుకనుకొన్నారూ?" అన్నది దీర్ఘంతీస్తూ.

మధ్యాహ్నం కూడు తీసుకురాని మనిషి, నాలుగ్గంటలకు కాఫీ తెస్తుందని నే నెట్లా అనుకొనేది సరోజినీ! పోనీ–

నీకే ఇట్లాంటి అనుభవం జరిగితే, నువ్వనుకొంటావేమో చెప్పు!"

"ఏమిటీ? ఏదేది? మళ్లా చెప్పండి. మధ్యాహ్నం మీరు అన్నం తినలేదా? ...చాల్లెండి, ఎవరన్నా వింటే నిజమనుకొంటారు. నేను గదూ మొరికిబోయిన పళ్ళెంలో అన్నమున్నూ, పప్పుకూరా, చారూ తీసుకొచ్చింది! తిని గూడా తినలేదనటానికి, మావాళ్ళు మీకేం విషంపోశారండీ?" అన్నది సరోజిని ఎక్కడలేని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

శంకరానికి నుండింది. అయినా పైకిమాత్రం నవ్వాడు.

"నువ్వు మాట్లాడుతున్నది నిన్నను గురించే అయితే నేను కాదనను." అన్నాడు.

"నిన్ననా నేను మొరికిబోయిన పళ్ళెంలో తెచ్చింది? ఏం పాడో! నాకు సరిగ్గా జ్ఞాపకంలేదు. అయినా...... భోజనం పైకి పట్టుకురావటమేమిటీ అసహ్యం. కిందికొస్తే తీరిపోదూ? నేనేమో మరిచిపోతిని. మీరా ఉదయంనుండి తిండి తినకపోతిరి. హాయిగా వేళకొచ్చి రెండు మెతుకులు తింటే సరిపోతుందామె! ఎందుకొచ్చిన బాదరబందీ యిదంతా?" అన్నది సరోజిని.

"నన్ను క్రిందికొచ్చి భోంచెయ్యమని చెప్పడానికి యింత అభినయం దేనికి సరోజినీ! ఇంతకంటే స్పష్టముగా చెబితే నేను కాదనేవాణ్ణి కాదే!" అన్నాడు శంకరం. అతను అంటున్న మాటలు వింటుంటే అవి మామూలు శంకరం అన్న మాటలుగా సరోజినికి అనిపించలేదు.

"నేను అభినయించానా?...మాట అనేముందు మీ రెండు కాళ్లోచించరు?నన్నేనా మీ రా మాట అనవలసింది! మతి మరుపు ఎవరికయినా ఉంటుందని మీ రెండు కను కోరు?" అంది సరోజిని తనని తాను సమర్థించుకొంటూ.

"నువ్వొక్కడే పొరబాటుపడుతున్నావు సరోజా! నువ్వు మరిచిపోయినందుకు నాకేబాధా లేదు. నిజంగా నువ్వు మరిచిపోవటమే జరిగితే, నే నేమీ తప్పుపట్టను..."

"అయితే నేను తమాషాకోసం నాటకమాడానంటారు. అంతేగదూ? అనండి. మీ చేత ఒక మాటపడినా నాకేమీ తప్పులేదు...ముందు మీ రా పకోడీలు తినండి. ఇప్పటికే కాఫీ చల్లారిపోయి ఉంటాయి. ఏదీ చూడనివ్వండి. ఇదేం! చల్లారిపోయాయి. మీ రా టిఫిన్ తింటుండండి. ఈ లోగా నేను కాఫీ వెచ్చబెట్టుకొస్తాను."

సరోజిని కాఫీ వెచ్చబెట్టుకొచ్చింది. శంకరం అట్లాగే మంచంమీద కూచుని ఉన్నాడు. అతను ఒక్క పకోడీనైనా ముట్టుకోలేదు.

"తినలేదేం?" అన్నది సరోజిని.

"నువ్వారికే నన్ను ప్రశ్నలువేసి చంపకు. అడగటానికేం నువ్వడుగుతావు. కానీ నేను చెప్పగలగొద్దూ? నే నెందుకు తినలేదో చెప్పాలంటే బోలెడంత జవాబు అవుతుంది. కుదించి చెప్పడానికి వీలుపడదు. అయినా సూచనగా చెబుతాను పట్టు. ఇవికూడా తినకపోతే ఎట్లా ఉంటుందో తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది. మానేశాను."

సరోజినికి చిర్రెత్తుకొచ్చింది. ఇంత పెడసరంగా సమాధానం చెబుతాడేం ఈ మనిషి? కుక్క-కాటుకు చెప్పు దెబ్బలాగా సమాధాన మివ్వకపోతే, లాభం లేదనుకుంది.

"మీ కంత బుద్ధిగా ఉంటే నేను కాదనటం బావుం డదు. అదెట్లా ఉంటుందో తెలుసుకోవాలని మీ రెంత ఉబ లాట పడుతున్నారో పాపం! నే నెందుకు వద్దనాలి?" అని చటుక్కున పళ్ళెము, నీళ్ళ గ్లాసూ, కాఫీ కప్పూ పుచ్చు కొని బైటికొచ్చింది. మెట్లదాకా వచ్చిందల్లా మళ్లా వెనక్కు తిరిగి, గదివాకిటి దగ్గర నిల్చొని "రాత్రికి భోజనం తెమ్మం టారో లేదో కనుక్కుపోదామని వచ్చాను. అవసరం లేక పోతే యిప్పుడే చెప్పండి. వృధాగా అటూ యిటూ మోసు కెళ్ళే భారమన్నా నాకు తప్పుతుంది" అన్నది.

"సాయంత్రం నేను అన్నం తింటానో తిననో యిప్పుడే యెట్లా చెప్పమంటావు సరోజా? మరో అరగంటకు నువ్వు మంచినీళ్ళు తాగుతావో, తాగవో ఇప్పుడే చెప్పగలవా? చెప్పలేవు. నాస్థితిగూడా ఫక్తు అట్లాగేఉంది. ఏది ఏమైనా కానివ్వు, నువ్వుమట్టుకు అన్నం పట్టుకురా. తినటమూ, తినక పోవటమూ అప్పుడు చెబుతాను.

సరోజినిముఖం మాడిపోయింది. గిరుక్కున తిరిగి గబ గబా కిందికెళ్ళింది. అయిదారు నిమిషాల తర్వాత పనిమనిషి మీద ఎవరో పెద్దగా కేకలువేయటం శంకరానికి వినిపిం చింది. ఆ కంఠం సరోజినిదేనని గుర్తుపట్టినప్పుడు శంకరానికి ఏదో సాధించిన సంతోష మేసింది.

కూతురు, అల్లుడు మధ్య పొర పొరలు పుట్టినాయని సీతాపతిగారికి తెలిసింది. ఆయన విచారించవలసినంతగా విచారించలేదు. మొగుడూ పెళ్ళాలు రద్దీ రట్టూ లేకుండా ఉండటం అసంభవం. ఈ సూత్రం తెలిసిందిగనుకనే సీతాపతి అల్లుణ్ణి ఈ విషయమైకదపలేదు. కానీ,ఒక విషయాన్ని గురించి ఆయన చాలాకాలంనుండి లోలోపల అనుకొంటున్నాడు. రెండు మూడు సార్లు ఆ విషయం పెదిమ చివరిదాకా వచ్చి——దానిదుంపదెగ – మళ్ళా లోపలికి చక్కా వెళ్ళింది. ఆ విషయం శంకరంతో తను నేరుగా చెప్పటం బావుండదు. బావున్నా అంత సత్ఫలితం ఉండనుగూడా ఉండదు. అదేగనక సరోజినితో చెప్పిస్తే అన్నివిధాలా సమంజసంగా ఉంటుంది. అతగాడు దానికి ఒప్పుకొంటే సరే సరి! ఒప్పుకోడో? 'చిన్నతుంకే నోరుజారి అన్నదాన్ని పట్టించుకుంటావుటోయ్' అని పెద్దరికాన్ని వెలిగించవచ్చు.

సరోజినితో ఎట్లా చెప్పటమా అని కొంతకాలంపాటు సీతాపతిగారు మదనపడ్డవారయినారు. కొంతకాలం అసలు చెప్పటం సబబా సబబుకాదా అని గూడా ఆలోచించాడు. ఆయన ఏ నిర్ణయానికీ ఇంకా రాలేదు. ఈ లోగా సరోజినే ఈ విషయం తండ్రిముందు వెళ్ళబెట్టింది.

"ఆయన ఊరికే ఉండిపోతున్నారు. పనీ పాటూలేదు. ఎక్కడన్నా ఉద్యోగం చూపెట్టరాదా నాన్నా" అన్నది సరోజిని.

"శంకరం నిన్నేమన్నా అడగమన్నాడా?" అన్నాడు సీతాపతి అనుమానంవేసి.

"ఆయనెందుకు అడగమంటాడు? మరి అదేంమనిషో-ఇరవైనాలుగు గంటలూ ఆ గది వొదిలి బైటికిరాడు. దిక్కుమాలిన పుస్తకాలన్నీ ముందేసుక్కూచుంటాడు. చూంచేదానికి నాకే విసుగేస్తుంది. ఆయన కివేమీ ఉన్నట్టులేదు. ఎక్కడన్నా ఉద్యోగంచూడు నాన్నా! లేకపోతే ఆయనకు పిచ్చెక్కేట్టున్నది" అన్నది సరోజని బాధపడుతున్నట్టు.

"శంకరం చెయ్యాలేగానీ, ఉద్యోగం ఎక్కడో వెతుక్కోవట మెందుకు? మన కమీషన్ కొట్లో కూచోకూడదూ? ఇప్పుడున్నవాడు ఉత్త పోచికోలు రామన్న. మాటలపసే గాని క్రియ సున్న. ఒక్కణ్ణి! ప్రతిదానికీ చచ్చిపోతున్నాను. ఇంకేం, రేపటినుండీ కొట్లోకి రమ్మను... చూడవే సరోజా, వ్యాపారమా పెద్దది. బోలెడంత డబ్బు తిరుగుతుంటుంది. అన్నిటికీ నే నెక్కడ చావను? శంకరం ఉంటే నాకు కాస్త ఆదరువుగా ఉంటుంది. అయినవా డొకడుంటే నా కీ బాదరబందీ కొంత తప్పనన్నా తప్పుతుంది. రేపు కొట్లోకిరమ్మని చెప్పు" అన్నాడు సీతాపతి.

"సరే నాన్నా!" అన్నది సరోజని ముక్తసరిగా.

తనపరిణాళిక వొక్కొక్కటే నెరవేరుతున్నందుకు సీతాపతి అమితంగా సంతోషించాడు. రవ్వలాంటి కుర్రాణ్ణి - దమ్మిడీకట్నం లేకుండా - సంపాదించాడు. ఇదొక ఘనవిజయంకిందనే జమ. ఈ సంవత్సరపు లాభనష్టాల బేరీజులో ఖానం పదివేలన్నా లాభాల పద్దులో వేసుకోవచ్చు. శంకరంగాడే దొరక్కపోతే, అంతడబ్బూ ఖర్చుపెట్టకతప్పే దేమున్నదీ? పోతే, రెండవది ఆ శంకరంగాడే లెక్కలు రాయ

టానికి రేపట్నుంచే రాబోతున్నాడు. ఇంగ్లీషు చదువు చది వాడు, కాబట్టి ఇప్పుడున్నవాణ్ని అయిదారు రోజుల్లో పీకి పారేయవొచ్చు. వాడికిస్తున్నది నెలకు డెబ్భయిరూపాయలు. ఆ లెక్కన సంవత్సరానికి పన్నెండు డెబ్భయిలు ఎనిమిది వందల నలభై—ఇదంతా లాభంకిందనే జమకొస్తుంది. తను ఉత్రటపుడియంగా అల్లుణ్ని సంపాదించటమే కాకుండా, వాడినుండి సంవత్సరానికి పది ఎక్కువ తక్కువగా వేయి రూపాయలు కక్కిస్తున్నాడు. తనుచేస్తున్న పని దివ్యంగానే ఉంది.

ఆ ఆలోచనల తాలూకు ఆనందం సీతాపతిగారు ఎక్కువకాలం పొందలేదు. మరి సరోజిని అట్లాంటి వార్త తీసుకొచ్చింది. మంచివార్తనే తీసుకురావాలని సరోజిని హోరాహోరి పోట్లాడింది. శంకరం తగ్గలేదు.

"నువ్వెంత గింజుకున్నా నేను కోర్టుకు వెళ్ళ"నని ఖచ్చితంగా తేల్చిపారేశాడు.

"కోర్టంటే పరాయివాళ్ళకోర్టుటండీ, మీరు పోన నటానికి! మనదేనాయె! మనపని మనం చేసుకోవటం తప్పా? ఇప్పుడున్నవాళ్ళంతా ఉత్తదొంగవెధవలట. ఎవడి కందింది వాడు పుచ్చుకొంటుంటాడట. మీరెళ్ళి ఊరికే అక్కడ కూచోండి, చాలు. తతిమ్మా పనంతా మా నాన్న గారే చూచుకొంటారు." అన్నది సరోజిని.

"నువ్వు చెప్పినదాన్నిగురించి ఆలోచిస్తుంటే నాకొ బోలెడన్ని సందేహాలు పుడుతున్నాయి. ఒకటేమి టంటే - ఏదోవిధంగా నన్ను నువ్వు వదిలించుకొందామని

చూస్తున్నావేమోనని. పాపం! నీ కల్లాంటి దురుద్దేశం లేక పోవచ్చు. మరి నా పాపిష్ఠి మనస్సుకు అట్లా అనిపిస్తున్నది. రెండవది: నువ్విప్పటికి అయిదారుసార్లు తమాషా అయిన 'పొడి' వొకటి వేశావు. 'మనవ్యాపారం' - 'మనకొట్టు'- 'మనకులాభం' అని నువ్వు వందసారులంటేమట్టుకు అది మనదెందుకవుతుంది? ఒకవేళ నీ కవుతే అవుతుందేమోగానీ, నాకుమట్టు కేమీకాదు. పదిలక్షలసార్లు అనుకొంటేమట్టుకు నేను హెజెల్ కోట్టు మొగుణ్ని అవుతానా? ఒక్కసారిగూడా అనుకోకపోయినా సరోజిని మొగుణ్ని కాకపోతానా? ఇదంతా మనదేనని చెప్పి, నాకు ఆశపుట్టించి, మీ నాన్నకు చాకిరి చేయించాలని చూస్తున్నావు. పోతే మూడవది, నేను వెళ్ళి ఊరికే కూచుంటే తతిమ్మా పనంతా మీనాన్నే చేసుకుపోతాడని నాకు నచ్చచెబుతున్నావు. నేను అక్కడికెళ్ళి ఉట్టినేకూచుంటే ఆయనకేం పొరుగుతుందో నాకు తెలియటంలేదు నువుచెబుతున్నదాన్నిబట్టి నేను పనేమీ చెయ్యటానికి కానేకాదాయె. అక్కడ ఊరికే కూచునే బదులు ఇక్కడే కూచుంటాను. ఇక నాలుగవది—"

"తల నొప్పెత్తుకొస్తోంది. ఇక ఆపండి" అన్నది సరోజిని విసుగ్గా.

"సమాధానం వినే ధైర్యం లేనిదానివి నన్నెందుకు ప్రశ్నిస్తావ్?" అన్నాడు శంకరం.

"ఊరికినే కూచోబెట్టి మేపటానికి, నే నంత లక్షాధి కారిని గానని మా నాన్న రెండు మూడు సార్లు చూచాయగా అన్నాడు. నా క్కూడా అది సబబుగానే తోచింది.

అయినా మీ రక్కడికెళ్ళి లెఖ్ఖా డొక్కా చూచుకో గూడదటండీ. ఆయనగ్గూడా అంత కష్టంగా ఉండకుండా ఉంటుందిగా!"

"నిజమేగానీ, నేను చెబుతున్నదికూడా మరి విను. ఇక్కడ కూచుంటే మీ నాన్నకు కష్టం గనక అక్కడే కూచోమన్నావు. బాగానేవుంది. అక్కడ కూచుంటే మరొక రికి కష్టంగా వుండి, ఇక్కడ కూచుంటేనే వారికి బావుంటుం దనుకో; అప్పు డేం చేయమంటావో చెప్పు మరి." అన్నాడు శంకరం.

"నే నేమీ చెప్పదలుచుకోలేదు...అయినా మీరు కూడా తిని కూచోవటం మరిగారు. ఎందుకు కష్టపడతారు? ఆ విషయం తెలుసుకోకుండా అనడం నాదే పొరబాటు."

శంకరం సంగ్రిహంగా నవ్వాడు.

"ఇంతకాలం నా భార్యగా వుండికూడా నన్ను అర్థం చేసుకోలేదన్నమాట. నీకు తెలియదుగానీ, సోమరితనమంటే నా కున్న అసహ్యం ఈ భూ ప్రపంచంలో మరొకడి కుంటుం దంటే నమ్మను. అయితే, ఎందుకు కొట్లో కెళ్ళవని అడుగు తావు. నేను వెళ్ళను. నా కేమవసరం? నేను చచ్చేట్టు పనిచేసి మీ నాన్న భోషాణాలు నింపలేను. ఇప్పటికే కట్టుకుపోయినంత సంపాదించాడు. ఆ గొడవలన్నీ మానుకో మని చెబుదామనుకొంటున్నాను...సరే, పని చేస్తాను. దానివల్ల నా కేమి వొరుగుతుందా అని? నేను ఊరికే కూచో వటం—అంతగా చూడలేనిదానివైతే, ఆ వ్యాపారంలో నాకూ భాగం పెట్టమను. అప్పుడు నువ్వు చెప్పనవసరం

లేకుండానే నేను నా పని చూచుకొంటాను. ఇందుకు మీ నాన్న యిష్టపడితే యీ సాయంత్రమే స్టాంపులు రాసుకొందాం. మరి వెళ్ళి అడిగి రా, హో."

సరోజినికి అరికాలిమంట నడినెత్తికెక్కింది.

"మరి ఊరికినే కూచుంటే పొట్టలోకి బువ్వెలా వొస్తుంది? మన కెవరు పెడతారు? ఇలా ఎంతకాలమని ఈ యింట్లో ఉంటామో చెప్పండి? ఎంత పుట్టిల్లయినా, ఒక నాడు పెడతారు, రెణ్నాళ్లు పెడతారు. కలకాలం మనల్ని పోషించాలంటే వాళ్ళకుమాత్రం కష్టంకాదూ?" అన్నది సరోజిని కసిగా.

శంకరం ఆశ్చర్యం నటించాడు.

విడ్డూరంగా మాట్లాడావే సరోజా నువ్వు. ఇంతకాలం నుండీ, మనల్ని మీవాళ్ళే పోషిస్తున్నారని యింతవరకూ నాకు తెలియనే తెలియదుసుమా!" అన్నాడు ముక్కుమీద వేలు వేసుకొని.

"మరి మన మేమిచ్చి తింటున్నామంటారు? ఏమన్నా చాటుగా మావాళ్ళకిచ్చారేమో నాకు తెలియదు. ఏమన్నా ఇచ్చారా?"

"ఇచ్చాను" అన్నాడు శంకరం. "అధమపక్షం ఇరవై వేలు ఖరీదుచేసే మనిషిని నేను. వాళ్ళింటో వారి కూతుర్ధుకు మొగుడుగా ఉంటున్నాను. ఈ ఉద్యోగభారం నెత్తినేసు కొన్నందుకు గాను, మీనాన్న నా కంత యివ్వదేలాడు. అందులో చిల్లిగవ్వకూడా యింతవరకూ జమపడలేదు. తన దగ్గరే దాచిపెట్టాడు. అందులోంచి మన కేమన్నా ఖర్చు

పెడితే పెట్టేఉండొచ్చు. నేను కాదనను. అంతమాత్రంచేత అది ఆయన డబ్బేంమకప్రుతుందో నా కర్థంకావటంలేదు. నీ కేమయినా అయిందేమో చెప్పు వింటాను!"

సరోజినికి తలతిరిగినంత పనయింది. శంకరం మాట్లాడిన ఈ చివరిమాటలు చెప్పరానంత అసహ్యామేశాయి. దాదాపు నాంతివచ్చినట్లుంది. నీరసంగా తలుపు పట్టుకొని బైటికెళ్ళింది. శంకరం చిన్న నవ్వునవ్వాడు.

* * * * *

ముద్దుబిడ్డ చెప్పిన యీ సువార్తలన్నీ విన్నతరువాత సీతాపతిగారు, పక్షవాతపు రోగిలా అయిపోయినాడు. కొన్ని నిమిషాలపాటు ఆయనగారి యమ మేధ సుద్దలాఅయింది.

"ఇదేమిటే! ఈ బాడఖావ్ యిట్లా తయారైనాడు? వీణ్ణి బాబుగాడిముల్లె మనదగ్గర దాచిపెట్టాగా వీడికి 'పిండం' వెయ్యటానికి? చచ్చేట్టు పనిచేసుకొంటేనే చేతిలోముద్ద నోటిలోకి రావటల్లేదుగదా! అంభోతులాగా వీణ్ణెంతకాలం మేపేటట్టు? సలీసుగా దొరికాడుగదా అని నేను సంతోషించాను. వీ డింత దూలగొండి బాపతని తెలిస్తే, గడపయినా తొక్కనిచ్చేవాణ్ణి కానే! ఇప్పు డేంచేసేట్టు?" అని ప్రశ్నించారు సీతాపతిగారు.

రాజమ్మ సమాధానం చెప్పలేదు. సరోజినీ సమాధానం చెప్పలేదు ఉన్నట్లయితే సత్యం సమాధానం చెప్పేవాడో లేడోగానీ, లేడు మరి. వా డీమధ్య తరుచుగా రాత్రిళ్లు మాయమవుతున్నాడు.

"ఈ పీడంతా మనకు దేనికీ? అమ్మాయిని వాడితో పంపేయండి. వాళ్లూవాళ్లూ గంగలో కలుస్తారు. మధ్యలో మనం పిసుక్కు-చావటమెందుకూ?" అన్నది రాజమ్మ.

"నీ తెలి వెప్పుడూ నాలుగేళ్లు వెనగ్గా ఉంటుంది. నీకు తెలిసిందల్లా అదే. అమ్మాయిని పంపితే వా డెక్కడుం టాడు? ఏంతింటాడు?" అన్నాడు సీతాపతి.

"ఆ రేళ్ళముందున్న వాళ్లు చేసిందేగా యిది! ఇట్లాతగు లడిందెందుకని? ఆనాడే నామాటవింటే ఏ చిక్కూ లేకుండా పోయేది. వాణ్ని చూడంగానే నాకు దౌర్భాగ్యుడల్లే కని పించాడు. ఆవిషయం తెలుసుకోవటానికి మీకు సంవత్సరం పట్టింది. పైగా నాది వెనకబుద్ధని మీ రంటున్నారు." అని ఎత్తిపొడిచింది రాజమ్మ.

ఎవ్వరూ మాట్లాడలేదు.

"మేనమామ లున్నారుగా! అక్కడేదో కాస్తఉన్నట్టే ఉంది. అక్కడికే తరిమేస్తే పోతుంది. ఎందుకొచ్చిన లాయి లూనా ఇదంతా చెప్పండి. కలిసివచ్చే చెప్పును తొడగొచ్చు. ఈ అబ్బాయి కలిసిరానే కలిసిరాడాయె. ఉత్త పెంకె ఘటం."

"మెల్లిగా అంటావేమమ్మా పెంకెఘటమని? పెంకెలో ఈయన్ది రణపెంకెతనం. ఉత్త కబుర్ల రాయుడు. కడుపునిండా మాట లున్నయ్. తలనిండా కుళ్ళుబుద్ధు లున్నయ్! ఎబ్బే! ఏం మనిషి? ఇటువంటాయన నా మొగు డని చెప్పుకోడానిగ్గూడా అభిమానపడి చస్తున్నాను." అన్నది సరోజమ్మ.

"అసలు ఈ పీడంతా తెచ్చిపెట్టింది నువ్వేగదూటే! వీణ్ణి మినహా మరోవాణ్ని చేసుకోను చేసుకోనని మొరాయిస్తివి. వీణ్ణి ప్రేమించానంటివి. పెళ్ళిచేస్తిమి. మొగాడుముఖ్యా పడ్డతరవాత ఫీ సెట్లో తయారయినాడు. అసలు నీ మూర్ఖమే కొంప కిన్ని తిప్పలు తెచ్చింది" అన్నది రాజమ్మ కూతురును కసురుకొంటూ.

భార్యమాట్లాడింది వొకరకంగా నిజమే గనుక సీతాపతిగారు మౌనంవహించారు.

"నాదేం తప్పున్నదీ! తెలిసో తెలియకో నేను ప్రేమించానని అన్నమాట నిజమే! అన్నానుగదాఅని మీరెందుకు ఆమోదించారు. చిన్నపిల్లలు తెలియక నిప్పు పట్టుకొంటామని ఏడుస్తారు. కిందపడి దొర్లుతారు. తెలిసినవారెవరైనా నిప్పుపట్టుకోనిస్తారా? ఏడుస్తున్నారుగదాఅని నిప్పుబొగ్గు ఆడుకోవటాని కిస్తారా? ఇవ్వరు. కానీ మీరు ఇచ్చారు. నేనా బొగ్గును ముట్టుకున్నాను. చచ్చేటట్టు కాలింది. కాలినందుకు ఏడుస్తున్నాను. 'ఎందుకు పట్టుకుంటానని మారాంచేశా'వని చిన్నపిల్లల్ని అడగటమే తప్పు. తెలియక వాళ్లెన్నెన్నో చేస్తామని మారాం పెడతారు. తెలిసినవాళ్ళు అవన్నీ చెయ్యనివ్వగూడదు. పైగా నా తప్పంటావేమమ్మా! ఇందులో నా తప్పేమున్నదే!" అన్నది సరోజిని

రాజమ్మ బిత్తరపోయింది. సీతాపతీ బిత్తరపోయాడు.

"పద్ధెనిమిదేళ్ళ దానివి, నువ్వేమీ తెలియని చిన్నపిల్లవుటే సరోజమ్మా!" అన్నది రాజమ్మ.

"ఏళ్ళనుబట్టి వయస్సును లెక్కగట్టటమంత మతిలేని పని యింకేదీ ఉండబోదు. తెలిసిందాన్నయితే, ఈ శంకరాన్ని పెళ్ళిచేసుకొంటానా? నేను వీణ్ని తప్ప మరొకాణ్ని చేసుకోనని పట్టుపట్టినప్పుడే నేను చిన్నదాన్నని మీరు గ్రహించిఉండవలసింది. మీ రా పని చెయ్యలేదు. చెయ్యనందుకు నేను అన్నివిధాలా ఉడ్డుకుడుస్తున్నాను." అన్నది సరోజని పమిటతో కళ్ళొత్తుకొని. ఆ పమిటకు ఏమాత్రమో నీటిచెమ్మ అంటింది.

సీతాపతిగారు పెద్దగాఅరవటం సరోజనికి వినిపించింది. ఆ ధోరణినిబట్టి చూస్తే ఎవర్నో కోప్పడుతున్నట్టుగాఉంది. "ఈయింట్లో నాన్న కోప్పడదగినవాడు శంకరంతప్ప యింకెవ్వరున్నా"రనుకొన్నది సరోజని. కడుపు మండిపోయి నాన్నగారే అల్లుణ్ణి కోప్పడుతున్నారనిభావించింది. ఆ కోప్పడటంలో "ప్రేమ" "డొక్కచీలుస్తాను"– "వెళ్ళగొడతాను"– "అడుక్కుతింటావు" వగైరా వగైరా సున్నితమైన మాటలుగూడా సరోజనికి వినిపించాయి. శంకరానికి ఆమాత్రం ఘోరంగా తగలకపోతే లాభంలేదనుకొన్నది. ఈ విషయం తన కేమీ తెలియనట్లుగానే సంచరించాలనుకొన్నది. అందుకనే నాన్నగారిమాటలు వినికూడా గదిలో నుండి బైటికి రాలేదు.

మరుక్షణానికే సరోజనికి యింకో అనుమానం కలిగింది. ఒక్కసారిగూడ శంకరంతో అరవిచ్చిమాట్లాడని నాన్న–ఒక్కసారే యింత కట్టుతెగి మాట్లాడతాడా? అథవా మాట్లాడినా యిన్నిమాటలూ, కిమ్మనకుండా శంకరంఎట్లా

భరాయిస్తున్నాడు. పోనీ యింకోకెవరినో అనుకోందామన్నా వీలులేకుండా ఉంది. "ప్రేమలూ" — "డొక్క-చీల్చటాలూ" యింకెవరి నంటాడు నాన్న? ఎవరినంటాడో సరోజిని యింకా తేల్చుకోలేదు. ఆకస్మికంగా సత్యంగొంతు వినిపించింది. వాడేదో బిగ్గరగా అరుస్తున్నాడు. అయితే ఈ గొడవంతా సత్తెమన్నయ్యదా? అయినా వీడికి ప్రేమలు, డొక్క-చీల్చులూ యేమిటి?

సరోజిని యింక స్థిమితంగా పడుకోలేకపోయింది. చివుక్కున లేచి, కుచ్చెళ్లు సర్దుకొని, పమిట సరిచేసుకొని వాకిట్లోకొచ్చింది. నాన్నా అన్నయ్యా ఘర్షణపడుతున్నారు. సరోజిని కేమీ అర్థంగాలేదు.

"ఏమిటి నాన్నా యిది?" అని అడిగింది.

"నీకుపట్టినజబ్బే వీడికీ పట్టుకున్నది. నీకొచ్చినదానికే తిన్నకూడు వంటబట్టకుండా ఉంది. ఇక వీడిగ్గూడబస్తే, పీల్చేగాలికూడా యిమడదు" అన్నాడు సీతాపతి.

తనకొచ్చిన జబ్బేమిటో, అదే వీడి కెట్లా వచ్చిందో, ఎప్పుడు వచ్చిందో సరోజినికి తెలియలేదు. అదేమిటో తెలుసుకోవటం అవసరమే అయినా, యిప్పుడు కాదు. నాన్న ఊరికే అన్నయ్యను తిట్టిపోస్తున్నాడు. ముందీ ప్రవాహాన్ని ఆపాలి.

"అదేమిటో నేను కనుక్కుంటానుగానీ, నువ్వు పని చూసుకో నాన్నా! సత్తెమన్నయ్యా! ఇట్లారా! ఇప్పుడే పోదువుగానీ..." అన్నది సరోజిని.

సీతాపతి వెళ్ళాడు. సత్యం దిగాలుముఖంవేసుకొని సరోజిని గదిలోకొచ్చాడు.

'అసలుసంగతేమిట్రా అన్నయ్యా?' అన్నది సరోజిని.

సత్యం యావత్తు సంగతీ చెప్పాడు. వాడు చెబుతున్నంతసేపూ సరోజినిముఖం రకరకాలుగా మారుతూనే ఉంది. సత్యం చెప్పటం పూర్తిచేసిన తరువాత సత్యానికి బదులు సరోజిని నిట్టూర్పు విడిచింది.

'లాభంలేదురా అన్నయ్యా! ఇట్లాంటి ప్రేమలూ వల్లకాడూ నువ్వేమీ నమ్మకు. మొట్టమొదట అట్లాగే ఉంటుంది. ఆ తరువాత చాలా బోలుగాఉంటుంది. నా మాట విని నువ్వా పిచ్చిపిచ్చి పనులు మానుకో' అన్నది సరోజిని.

'ఎంత సులభంగా చెప్పావే సరోజా! నువ్వన్నంత తేలికగాఉంటే నేనుమాత్రం వదులుకోనూ? నువ్వు సుందరాన్ని చూడలేదుగానీ, చూస్తే అమాంతం దాన్ని కావిలించుకొని నలిపిపారేస్తావు; మరేమనుకొన్నావో. అట్లాంటి దాన్ని ప్రేమించినందుకు నాకో పార్టీ యిస్తావు. ఇవ్వకపోతే నా చెవి తెగ్గోయించుకొంటాను. సాయంత్రం వెడదాంరా. నీకు చూపిస్తాను' అన్నాడు సత్యం.

సరోజినికంటికి సత్యం ఉత్తఅర్భకుడిలా కన్పించాడు.

'నువ్వన్నది నిజమేకావచ్చు నన్నయ్యా! కానీ నేనెందుకు చెబుతున్నానో కాస్త ఆలోచించు. ప్రేమించి పెళ్లి చేసుకోవటమంత దరిద్రపుపని యింకొకటి లేనేలేదు. మనమేచో ఔన్నత్యాలు మారంగాఉండి చూచి ప్రేమించిపారేస్తాము. తీరా దగ్గరకెళితే అగాధాలు, చీకటి అక్కడుంటాయి. నే నిది అనుభవంమీద చెబుతున్నాను. ఎప్పుడైనా

నువ్వు పెళ్లిచేసుకొంటే ప్రేమించిమట్టుకు చేసుకోకు' అని సలహాయిచ్చింది సరోజిని.

ఈ సలహా సత్యానికి సుచించలేను.

'గడిచిపోయిన మాటలు మాట్లాడతావేమే సరోజా? నువ్వు శంకరాన్ని చేసుకోవాలని ఎంత ప్రయత్నంచేశావో నీకు తెలియదూ? ఎంతమంది చెప్పినప్పటికీ నువ్వు విన్నావా? అప్పుడు నీకు శంకరంలో యేయే గొప్పదనాలు కనిపించాయో, అంతకు పదివేల రెట్లు యెక్కువ నాకు సుందరంలో కనిపిస్తున్నాయి' అన్నాడు అన్నయ్య.

'అదంతా ఓపీడకల. ఆ కలలో చూచినవన్నీ అందంగానే ఉంటాయి. కల దాటి, వొడ్డుకొచ్చి చూస్తే చాలా అసహ్యమేస్తుంది.'

'అందరి అనుభవాలు ఒకేరకంగా ఎందుకుంటాయి? నువ్వన్నట్లు 'ప్రేమ'లో ఏ పసా లేకపోతే, రాజ్యాలకు త్యాగం చేసినవాళ్ళంతా వెర్రివాళ్ళని నేనెట్లాఅనుకోంటాను? ఎంత ఆనందం లేకపోతే, వాళ్లా త్యాగాలు, సాహసాలు చేస్తారు? పరమ చచ్చుదానికోసం యింత...'

సరోజిని ముఖంమీద మ్లానమైనహాసం అంకురించి అంతలోనే సమసిపోయింది.

"నువ్వు మంచిఉద్దేశంతోనే బయలుదేరావు కాని, ఎక్కడో దోవతప్పావు. బాను కెళ్ళడానికి బదులు చిట్టడివిలో కెళ్లావు. అంతమాత్రంచేత బాను కెళ్ళాలనుకోవటమే తప్పనటం మంచిమాటకాదు. అదీగాక- నువ్వు దోవతప్పావని నేను తప్పుతానా? నీ అనుభవాన్ని తీసుకొని నేను మంచి

దోవలోనే వెడతానేమో నీకేం తెలుసు? వెళ్ళలేనని నువ్వేమీ గ్యారంటీ యివ్వలేవుగదా?"

"ఇవ్వలేను" అన్నది సరోజిని. "నేనొప్పుకోను సత్తెమన్నయ్యా! నీకు కోపమొచ్చినా సరే. నా శక్తి ఉన్నంత వరకూ, నీకా సుందరంతో పెళ్ళికాకుండా చూస్తాను. చూస్తూచూస్తూ నిన్నుగూడ ఎలా ముక్కలు కానివ్వనన్నయ్యా?"

ఈమాట విన్నతరవాత సత్యానికి ఎక్కడలేని కోపమూ వచ్చింది.

"ఇదిటే నువ్వు నాకుచేసేమహోపకారం! నీకా శంకరంతో పెళ్ళి స్థిరపడటానికి ఎంత ప్రయత్నం చేశాను! సర్వమూ బదాబదలైన వ్యవహారాన్ని జాగ్రత్తగా ఒక కొలిక్కి తెచ్చానుగదా! కనీసం ఆ విశ్వాసమన్నా లేకుండా మాట్లాడుతావటే సరోజా! ఆరోజున నేనేగనక పట్టుపట్టకపోయినట్లయితే నీకీ పెళ్ళి అయ్యేదేనా?... పైగా నీచేత నాన్నగారికి చెప్పిద్దామనుకుంటున్నాను. మంచిదానివే నే! రేపు నాన్నతో గూడ యిట్లాగే చెబుతావా యేం?"

"ఆఁ. ఇట్లాగే చెబుతాను" అన్నది సరోజిని.

సత్యానికి చెల్లెల్ని చంపబుద్ధేసింది. అవసరమున్నంత వరకూ తనను వాడుకొంది. తన కవసరం కలిగేటప్పటికి శ్రీరంగనీతులు చెబుతున్నది. ఛ ఛ! అసలీ ఆడజాతే బాడఖావ్ జాతి. వీళ్ళను చస్తే నమ్మగూడదు---ఇట్లాంటి సదభిప్రాయాలు---పాపం! సత్యానికి చాలా స్ఫురించాయి... ఆఖ

రికి ఉండబట్టలేక- 'నువ్వింత కృతఘ్నురాలి వనుకోలేదు చెల్లెమ్మా!' అన్నాడు సత్యం.

"నిజంగా నా పెళ్ళి నీ సహాయంవల్లనే జరిగినట్లయితే, నీ అంత దేభ్యం మరొకడు లేడని నే నంటున్నాను. ఆరోజున నువ్వా దిక్కుమాలినపట్టుదల చూపకపోయినా, నేను సుఖ పడేదాన్నేమో! ఏదో ఉద్ధరిద్దామని అన్నావు. అది యెదురుతిరిగింది" అన్నది సరోజిని.

తనసహాయాన్ని యింత ఘోరంగా చిత్రించినందుకు సరోజినిని అసహ్యించుకొన్నాడు సత్యం

"నువ్వసలు యేరుదాటి తెప్పతగలేసే రకం. వెధవను నేనే కనుక్కోలేకపోయాను. కాని సరోజా! నేను నువ్వను కొంటున్నంత తెలివిహీనుణ్ణికాదు. సుందరాన్ని చేసుకోవటం నీ కెందు కిష్టంలేదో నేను సులభంగా అర్థంచేసుకోగలను" అన్నాడు సత్యం.

"అర్థంచేసుకోలేవని నా నమ్మకం. నే నెంతో అను భవంవల్లగాని అది తేల్చుకోలేదు. అందుకోసం బొచ్చెడంత కాలం ఖర్చుపెట్టాను. చాలా అభిమానంగూడా వినియోగిం చాను. ఇప్పటిగ్గానీ నాకు 'అసలు' యేమిటో తెలిసిందికాదు. ఇంత కష్టపడ్డతరువాతగానీ నేను తెలుసుకోలేని ఆ 'అర్థం' నీకు యిట్టే తెలిసిందంటే నేను నమ్మను" అన్నది సరోజిని.

"నమ్మకపోతే మానెయ్యి. నువ్వు నమ్మనంతమాత్రాన నాకు తెలిసిందేమిటో, తెలియనట్లుకాదు.'

అసలే మనస్థిమితంలేని సరోజినికి అన్న అంటున్న మాటలు మరింత బాధగా తోచాయి.

"నువ్వేమి తెలుసుకొన్నా"వని ప్రశ్నించింది.

"ఒసే సరోజా! నువ్వు నా కళ్ళముందు పుట్టినదానివి. నాకు దుబికీ యివ్వగల ననుకోను... అయినా అది నీ వొక్క దాని తప్పేగాదు. మీ ఆడజాతిలోనే ఉంది. ఒకరినిచూచి వొకరు సహించరు."

సరోజినికి అంతటి అస్తిమితంలోనూ ఆశ్చర్యమేసింది.

"నువ్వంటున్నది సుందరాన్నిచూచి నేను అసూయ పడుతున్నాననేగదూ?"

"ఆహా! నీ కంటే 'సుందరం అందగత్తె' అని నువ్వు ఏడిచిపోతున్నావు. దానిముందు నీ కురూపితనం చూపుకో వటం నీ కిష్టంలేదు. అట్లా చూపుకోవటంవల్ల నీ అందపు విలువ తగ్గిపోతుంది. అట్లా తగ్గటం నీకిష్టం లేదు. ఈ కొంప లోకల్లా నువ్వే సౌందర్యరాశివని అనుకోవటానికి అప్పుడు నీకు అవకాశం ఉండదు. అందుకే నువ్వు 'సుందరాన్ని చేసుకోవ'ద్దని నాకు హితోపదేశంచేస్తున్నావు. అసలు నీ కడుపులో ఉన్న విషపు ఆలోచన యిదీ. దీన్ని కప్పిపెట్టు కొనేందుగ్గాను, అనుభవమని, వల్లకాదని నాకు చెబుతు న్నావు. నీ కుళ్ళుమోతుతనం నాకు తెలుసునని నీకు తెలీదు. అవునా?" అన్నాడు సత్యం—సరోజిని తన చెల్లెలనే విషయం మరిచిపోయి.

సరోజినికళ్ళంట నీటిపొర కమ్మింది. "నాకు లేని దురుద్దేశాలన్నీ ఎందు కంటగడతావురా అన్నయ్యా? నే నింతవరకూ సుందరాన్ని చూడనైనా చూడలేదే! ఎట్లా అసూయపడతాను?"

"తప్పుకోవడానికి చూడకు. నేను అంతంతమాత్రపు దాన్ని 'లవ్' చెయ్యానని నీకు మట్టుకు తెలీదూ? నే నింత యమపట్టుపడుతున్నానంటే, సుందరం ఏమాత్రపు అందగత్తో నువ్వు ఊహించుకోలేవా? మరి నువ్వు అసూయపడటానికి సుందరాన్ని చూడట మెందుకు?"

"నా రోజులు మంచివిగావు. నే నే మంచి చేయబోయినా అది విషమయిపోతున్నది. నీ యిష్టం! నువ్వూ, నీ సుందరమూ కట్టగట్టుకొని ఏ గంగలో దూకినా నా కభ్యంతరం లేదు." అన్నది సరోజని విరక్తిగా.

"అదుగో చూశావా! క్షణంలో బైటపడ్డావు. మరి-నీకే అసూయా లేదని బుకాయిస్తావెందుకు? లేనిదానివైతే కట్టకట్టుకొని గంగలో దూకమని అననే అనవు" అన్నాడు సత్యం దొంగను పట్టుకున్నవాడిలాగా.

"బుద్ధితక్కువయింది. ఇక ఎప్పుడూ అనను" అన్నది సరోజని కోపంగా లెంప లేసుకొని.

ఇంతలోనే ఫకాలుమని నవ్వు వినపడ్డది. సత్యం అటువేపు చూశాడు. మెట్లదగ్గిర శంకరం నిలబడిఉన్నాడు. అయితే ఈ గొడవంతా శంకరానికి తెలిసిపోయినమాటే! ఈ ఆలోచన రాగానే సరోజనికి తల తీసేసినట్టయింది. ఆయనగారు చూస్తుండగా అన్నయ్య తనచేత లెంపలు వేయించాడు. ఎంత ఛండాలం! సరోజని ముఖం చిన్నబుచ్చుకొని గబగబా లోపలికెళ్ళిపోయింది. రెండవసారి శంకరం నవ్విన నవ్వు ఆమెకు వినిపించనే లేదు.

"ఏం సత్యం! ఈమధ్య ఎక్కడా కనిపించటం లేదు. పూర్లో లేవా యేం?" అన్నాడు శంకరం.

"ఉన్నానండీ!" అన్నాడు సత్యం.

"ఉండికూడా కనిపించటంలేదే? సరోజినికిమల్లే— నువ్వుగూడా—నా ముఖం చూడగూడ దనుకొన్నావా?"

సత్యం పలకలేదు.

"నీకు తొందరపను లేమో లేకపోతే ఒకసారి పైకి రాగలవా?" అన్నాడు శంకరం.

ఈ ప్రశ్నకు కూడా సత్య మేమీ మాట్లాడలేదు. అసలు శంకరంతో మాట్లాడటమంటేనే సత్యానికి ఏమిటో భయంగా ఉంటుంది. అందులోనూ—ఇంత 'యిది' అయిన తర్వాత మాట్లాడటమంటే అసలే కుదిరిచావదు.

"ఏమన్నా-పని ఉందా?" అన్నాడు శంకరం.

'లే' దన్నట్లు తల అడ్డంగా తిప్పి, శంకరం వెనకాతలే అడుగులో అడుగు కలిపాడు సత్యం.

"అట్లా కూచో......ఫరవాలేదు ఆ మంచంమీద కూచో. నే నిక్కడ చతికిలబడతాను" అని, సత్యానికి మంచం చూపించి, తను కుర్చీలో జారగిలబడి, రెండు కాళ్ళూ మంచంమీద పెట్టాడు శంకరం

శంకరం బెరుకు బెరుగ్గా కూచున్న సత్యాన్ని చూచి 'ఎందు కలా బెదురుతావు సత్యం! ఇంత పిరికివాడివి రేపు సుందరాన్ని చేసుకొంటే యెట్లా? ఆమెను చేసుకోవటం మీవాళ్ళ కెవరికీ ఇష్టంలేనట్లు - నా కనుమానంగా ఉంది నిజమేగదూ?' అన్నాడు.

'ఔనండీ?' అన్నాడు సత్యం.

'అయితే ఏం చేదా మనుకొంటున్నావు?'

సత్యం మాట్లాడలేదు.

"ఆ చేసే దేమిటో నాకు తెలియకుండనిదైతే, చెప్పమని బలవంతపెట్టను. అదేమన్నా రహస్యమా?"

"అబ్బే! ఏ పాడూ గాదు. అసలు ఏం చెయ్యాలో ఆలోచించనే లేదండీ! శతవిధాల మావాళ్ళను వొప్పించటానికి చూస్తాను..."

"అబ్బే! నువ్వు చూడవని కాదు. సహస్రవిధాల గూడా చూస్తావు. చూచినా వొప్పుకోరనుకో. అప్పు డేమిటి చేస్తావు? అదీ నాకు కావలసింది. దాన్ని చెప్పటానికి నీ కేమన్నా అభ్యంతర మున్నదా? అనే నే నడిగిందికుండా."

"ఏం చెయ్యమంటారు?" అన్నాడు సత్యం.

"గొప్ప చిక్కే తెచ్చిపెట్టావు సత్యం! నువ్వీ ప్రశ్న అడుగుతావని తెలిసిగూడా, సమాధానం ఏరిపెట్టుకో లేదు. ఒకటి: మీవాళ్ళను వొదిలి సుందరాన్ని చేసుకోటం. రెండు - సుందరాన్ని వొదిలి, మీ వాళ్ళనే చేసుకోవటం- అదే అదే—మీవాళ్ళతోనే ఉండటం. ఈ రెండు మార్గాల కంటే లేనే లేవు. నువ్వేది యెన్నిక చేసుకొన్నా, ఈ రెండిటిలోనే చేసుకోవాలి" అన్నాడు శంకరం. "ఏమోయ్ సత్యం! నీ దగ్గిర సిగరెట్టున్నదా?"

శంకరం సిగరెట్టు కాల్చగా త నెన్నడూ చూడలేదు. అయితే ఈమధ్య అలవాటు చేసుకొన్నాడన్నమాట.

సత్యం సిగరెట్టిచ్చాడు. అగ్గిపుల్ల గీచి తనొకటి వెలిగించాడు ఆ పుల్లతోనే శంకరంసిగరెట్టుగూడా అంటించాడు.

"థాంక్స్" అన్నాడు శంకరం.

"నో మెన్షన్" అని సత్యం అన్నదీ లేనిదీ శంకరానికి వినపడలేదు.

"అయితే, చూడు సత్యం! నువ్వు సుందరాన్ని గట్టిగానే ప్రేమించావుగదూ?"

ఏ సంగతి చెప్పటానికీ సత్యం సిగ్గుపడ్డాడు.

"ఇక చెప్పక్కర్లేదు నువ్వు గట్టిగానే ప్రేమించి వుంటావు... ...చూడు సత్యం! ఈ వైభవలోకంలో ప్రతి దానికీ వొక కారణముంటుంది. ఒక్కోసారి ఆ కారణం చాలా దాపులో ఉంటుంది. ఇంకోసారి మనం కనుక్కో లేనంత దూరంలో ఉంటుంది. నువ్వు సుందరాన్ని ప్రేమించిన కారణం దాపులో ఉన్నదా? దూరంగా వున్నదా? ఎందు కడుగుతున్నానంటే—దాపులో ఉంటే— ఆ కారణం సజావయినదో కాదో చప్పున తేల్చుకోవచ్చు. దూరంలోఉంటే—అది దాపుకు వచ్చిందాకా ఆగవలసి ఉంటుంది."

"సుందరం చాలా అందంగా ఉంటుందండీ! మీరు చూడలేదుగానీ, అచ్చం 'నర్గీసు'లా ఉంటుంది. ఆవిడంటే నా కెంతో ఇష్టం." అన్నాడు సత్యం సిగ్గుపడుతూ.

"బావుంది. అయితే - ఆ అందం ఎంతకాల ముంటుం దనుకొన్నావు సత్యం? రేపు స్ఫోటకం పోస్తే చాలు—ఆ నర్గీస్ ఉత్త దిష్టిబొమ్మలాగ తయారవుతుంది! అప్పుడు

నువ్వు సుందరాన్ని ప్రేమించటానికి అందమనేదే ఉండదు. మరి సుందరం గతేమిటి? అందమూ లేగదా నువ్వు కోరింది. ఆ అందం కాస్తా తలకిందులైతే సుందరం దిక్కులేని పక్షి కావటంకన్నా, ఇంకో మార్గం ఏమయినా ఉన్నదా?"

సమాధానం చెప్పటానికి సత్యానికి కేమీ తోచలేదు. అయినా ఏదో ఒకటి చెప్పాలి. ఈ క్షణంలో వెనకాడితే - అసలుకే మోసంరావచ్చు. సుందరం తనకు దక్కాలంటే ఇప్పుడు తను ధీరంగానే మాట్లాడాలి.

"మీరన్నట్లు - సుందరం - దురదృష్టవశాత్తూ, రేపు కురూపి కావడమే జరిగిం దనుకోండి. అంతమాత్రంచేత, సుందరాన్ని ప్రేమించకపోవటం ఎందుకు జరుగుతుంది. ఆవిడ కురూపి అయినంత మాత్రాన - ఆవిడ మనస్సుకూడా కురూపి అవుతుందంటారా? దురదృష్టవశాత్తూ అదికూడా జరిగిందనుకోండి. అంతగా వక్రించిన మనస్సుగలదాన్ని - నన్నే అంటిపెట్టుకొని ఉండమని - నే నేనాడూ అనను. నాకు కావలసిందల్లా సుందరం సుఖపడటం. ఆవిడ "నన్ను చేసుకొంటేనే సుఖపడతా"నని అనుకొంటున్నది. నేనెందుకు కాదనాలి?" అన్నాడు సత్యం ఉద్రేకంగా.

"భేషూ! బాగా అన్నావు ఈ అన్నదంతా ఆచరణలో పెట్టగలిగితే - నువ్వు నిరభ్యంతరంగా సుందరాన్ని పెళ్ళాడేసెయ్. నీకు కావలసిన సహాయమంతా నేను చేస్తాను" అని భరోసా యిచ్చాడు శంకరం.

సత్యానికి ఎక్కడలేని సత్తువా వచ్చినట్లయింది. తనను సమర్థించే వా రొకరున్నారు. ఇక భయంలేదు. తను

హాయిగా సుందరాన్ని చేసుకోవచ్చు. అంతకన్నా హాయిగా......

నిజమైన వ్యాపారస్థుడు 'మాయావి' లాంటివాడు. అతనికెన్నో మంత్రాలు, తంత్రాలు తెలిసుంటాయి. మట్టిలోంచి మాణిక్యాలు పుట్టిస్తాడు. ఏమీలేనిదాంట్లోంచి 'లాభం' పిండుతాడు. అట్లా పిండగలిగినవాడే నిజమైన వ్యాపారస్థుడు. పిండలేనివాడు వ్యాపారం చేస్తున్నప్పటికీ— వాడు వ్యాపారస్థుడు కాడు. సీతాపతిగారు గట్టి వ్యాపారస్థుణ్ణని మరోకసారి రుజువు చేసుకొన్నారు. ఆయనకు వ్యాపారంలో —ఉత్త వ్యాపారమే కాదు— దాన్ని మించిన 'నైపుణ్యం' కూడా ఉంది. సూరన కవిత్వంలోని అలంకారశాస్త్రంలాగా, చలంగారి టెక్నిక్ లాగా ఆయన నైపుణ్యం యితరులను యిట్టే ఆకర్షించివేస్తుంది. వ్యాపారంలోని లగువు బిగువులన్నీ సీతాపతిగారు, నిత్య జీవితంలో కూడా ఉపయోగపెడుతుంటారు. అందువల్ల ఆయనకు — ఏ ఫలితం కలిగినా — యిబ్బడి ముబ్బడిగానే కలుగుతుంటుంది.

సత్యానికి సుందరానికి పెళ్ళిచేశాడు. దీనివల్ల ఆయనగారు ముఖ్యమైన పనులు రెండు మూడు సాధించారు. ఒకటి సుందరంతండ్రి నుండి కట్నం గుంజాడు. ఆ కట్నం తీసుకోవడం సత్యానికేమీ యిష్టంలేదు. అయినా సత్యం తలూపాడు. పూపకపోతే సుందరం తనకు దక్కదు. సుందరం తండ్రి కటిక దరిద్రుడయినట్లయితే యేమోగానీ, యింత వున్నవాడు. పైగా ఈనాటికీ ఆర్జిస్తున్నవాడు. అటువంటి వాడినుండి పదివేలు కట్నం తీసుకోవటం అట్టే ఆక్షేపణీయం

కాదు, సుందరంగూడా ఈ విషయాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. సత్యంలాంటి మొగుడు - అందులోనూ తనకోసం వెర్రులెత్తుకొని తిరిగేవాడు - పదివేలల్లో దొరకటమంటే—అది అదృష్టంకిందే జమ.

రెండోది ప్రేమించిన అమ్మాయితోనే కొడుక్కు ముడిబెట్టాడు. ఈ రెండో విజయాంతాలూకు ఘనత మొదటి దాంట్లోనే ఉన్నది. పోతే మూడోది - ఇది చాలా ముఖ్యమయినది. శంకరం తనంటే ఎడమొఖం పెడమొఖంగా ఉంటున్నాడు. తన స్పర్శ అంటేనే అతనికి గిట్టటల్లేదు. లక్షణమైన అల్లుడు ఇంట ఉంటేగూడ - అతన్నేమాత్రం తను ఉపయోగించుకోవటంలేదు. ఇది తన వ్యాపార దక్షతకే తీరని కళంకం. శంకరం తన మాట వినటానికి ముందు- తను- అతనిమాట వినాలి. అందువల్ల శంకరానికి తనమీద సదభిప్రాయం కలిగే అవకాశమున్నది. అట్లాంటిది కలిగినట్లు ఏ మాత్రం పొడగట్టినా, శంకరం చిత్తుఅయినాడన్నమాటే! అందుకే- ఈ వివాహం- కేవలం శంకరంమాట విని చేసినట్లే చేశాడు.

అయితేనేం? సీతాపతి అదృష్టహీనుడు. ఆయన గ్రహాలన్నీ యీ మధ్య వక్రిస్తున్నాయి. ఇంకో ఆరునెలలకు పెసలధర ఎంత పలుకుతుందో చూచాయగా చెప్పగలిగిన సీతాపతి - మరో అరగంటకు తనింట్లో ఏమి జరుగుతుందో చెప్పలేకపోతున్నాడు. ఎట్లా చెబుతాడు? ఈ క్షణాన ఆ ఇంట్లో ఒక్క ఖూనీలు మినహా ఏమి జరగటానికైనా కావలసిన పరిస్థితులున్నాయి. ఒకళ్ళకొకళ్లకు మధ్య

ఉండవలసిన సంబంధాలే లేవు. ప్రతిమనిషీ మరొకణ్ణి శత్రు వులాగా చూడటం నేర్చుకొన్నాడు. ఈ అవ్యవస్థకు కారణ మేమిటో యెవ్వరికీ తెలియటంలేదు. ఈ కొంపను వొకదారికి తెద్దామని సీతాపతిగారు విశ్వప్రయత్నం చేశారు. ఆయన ప్రయత్నాల్లో వొక్కటిగూడా అక్కరకురాలేదు.

శంకరం మామూలు పద్ధతిలోనే నడుస్తున్నాడు. అతగాడా గదిని విడవలేదు. నూతనదంపతులకుగాను పై భాగంలోనే మరోగది ఏర్పాటుచేశాడు శంకరం. భర్త పై గది ఏర్పాటుచేస్తున్నాడు కనుక తను కిందిగది ఏర్పాటు చేయాలని సరోజిని వృథా ప్రయత్నంచేసింది. సత్యం ఒప్పు కోలేదు. ఆ వెంటనే సుందరంగూడ వొప్పుకోలేదు. ఇదంతా చూస్తుంటే సరోజిని కొక అనుమానం తట్టింది. శంకరం తన మీద కక్ష సాధింతామని సత్యాన్నీ, సుందరాన్నీ తనపక్షం చేసుకొంటున్నాడా? లేకపోతే ప్రేమ వివాహంలో నమ్మకం లేకపోయినా సుందరాన్నే చేసుకోమని సత్యానికి పురి ఎక్కించటం యెందుకు? సత్యం ఏ వెంకమ్మను - ఆయన భాషలో ఏ వెంకమ్మను చేసుకుంటేమట్టుకు తనకేం వొరుగు తుంది? సుందరాన్ని చేసుకోవద్దని తను చెప్పింది. చేసుకో మని శంకరం ప్రోత్సహించాడు. అంటే తనేదైతే చెబు తుందో దానికి వ్యతిరేకమయినదే శంకరం చేస్తున్నాడన్న మాట. తద్వారా తన కక్ష తీర్చుకొంటున్నాడన్నమాట. ఇప్పుడు సత్యాన్ని, సుందరాన్నిగూడా పైకే పిలిపించుకొం టున్నాడు. దానివల్ల శంకరం చాలాచాలా సాధించవచ్చు. వాళ్ళిద్దరి ఆనందానికి తనెట్లా కారణభూతుడో బాగా నూరి

పోవొచ్చు. తనేగనుక పట్టుబట్టకపోతే, ఈ వివాహం కానే కాదని ఊదరగొట్టవచ్చు. ఒకే అబద్ధం పాతికసార్లు చెబితే అదే నిజమవుతుంది. ఈవిధంగా శంకరం తనకు వ్యతిరేకంగా వొక శత్రుకూటమిని తయారుచేస్తున్నాడు. అదను చూచుకొని ఎప్పుడో ఈ బలగాన్నంతా తనమీద ప్రయోగిస్తాడు. ఇంత ప్రయత్నమూ చేయటానికి తను శంకరానికేమి ద్రోహం జేసింది?

ఏమిచేసిందో సరోజినికి జ్ఞాపకంరాలేదు. ఇక జ్ఞాపకం తెచ్చుకునేందుకు ప్రయత్నించటం అనవసరం. ఏమో! ఒకవేళ తనకు తెలియకుండా యేమన్నా చేసేఉన్నదేమో, శంకరాన్ని కనుక్కుంటే అన్నివిషయాలు తెలిపోతాయి. ఈ అభిప్రాయంతోనే వొకనాడు శంకరాన్ని అడిగింది.

"నువ్వు నాకు ద్రోహంచేశావని యెవరన్నారు? నే నెవరితోటీ, ఎప్పుడూ అన్నట్లు జ్ఞాపకంలేదు." అన్నాడు శంకరం నిశితంగా.

"మీరన్నారని కాదు. నా అంతట నేను అనుకున్నాను. ఒకవేళ తెలియకుండా ఏమన్నా చేశానేమో తెలుసుకొందామని—"

"అసలు నీ కా పాడుఅనుమాన మెందుకొచ్చింది సరోజా! నువ్వు నాకు ఏదో చేసిఉంటావని నువ్వెందు కనుకొంటున్నావో నా కర్థంకావటంలేదు. నామట్టుకు నేనెప్పుడూ అట్లా అనుకోను. మీదుమిక్కిలి అట్లాఅనుకొనేవాళ్లంటే నాకు అసహ్యం" అన్నాడు శంకరం.

"మీ చేష్టలుచూస్తుంటే నా కట్లాగే అనిపిస్తున్నది"

"ఏమని?- నువ్వేదో నన్ను అఘాయిత్యం చేసినట్లా? నాలో యేమిచూచి నువ్వట్లా అనుకొన్నావు సరోజా?" అన్నాడు శంకరం.

"చెబుతాను. మా అన్నయ్యా, వదినా అక్కడున్నారేమో చూడండి" అన్నది సరోజిని మెల్లిగా.

శంకరం చూచివచ్చి "లేరు" అన్నాడు.

"వస్తారేమో చూస్తుండండి" అన్నది సరోజిని.

"ఎందుకు?" అన్నాడు శంకరం యిదేమీ అర్థంగాక.

"చెబుతాను. వాళ్ళు వింటే బావుండదు."

శంకరం ఫక్కున నవ్వాడు.

"అయితే నువ్వుచెప్పేది నిజమయిఉండదు. ఎందుకంటే- నిజమే చెబుతున్నప్పుడు- నువ్విట్లా భయపడవలసిన అవసర మేమున్నది?"

"నేను చెప్పేదేమిటో వినకుండానే మీరు-నాది అబద్ధమంటుంటిరి. ఇక నే నేంచెప్పను?"అన్నది సరోజిని రవ్వంత ఆగ్రహంగా.

"వింటాను. ఒకవేళ నేనే పొరబాటేమో?"అని శంకరం వినటానికి సిద్ధపడ్డాడు. సరోజినికి ఎక్కడ ప్రారంభించాలో తెలియలేదు.

"ఎందు కనుకొన్నానంటే—" అని మొదలెట్టింది.

"ఏమని?"

"అదే- మీరు నేను ఏదోచేశానని-"

"ఓహో!" అన్నాడు శంకరం లింకుఅందుకొని.

"మీరుచేస్తున్న అన్నిపనులూ నాకు వ్యతిరేకంగానే చేస్తున్నారు. ఎక్కడిదాకానో యెందుకు? మా అన్నయ్యకు నేను క్రిందిగది యేర్పాటుచేశాను. కాదుగూడదని మీరు పైకి లాక్కొచ్చారు. సుందరాన్ని చేసుకోవద్దని సత్యానికి నేను చెప్పాను. మీరు పట్టుబట్టి సుందరాన్నే వాడికిచేశారు ఇట్లాంటివి బోలెడున్నాయి. వీటినిబట్టి నేనేమనుకోవచ్చో మీరే చెప్పండి!" అన్నది సరోజిని.

అప్పుడు ఆమె మాట్లాడుతున్నపద్ధతి చూస్తే శంక రానికి చాలా జాలేసింది. కానీ దాన్ని బైటపడనివ్వలేదు.

"నీ సందేహాలు వింటుంటే నీ మనస్సు మహా కశ్మల మయంగా ఉన్నట్టు నా కనిపిస్తున్నది. ఎదటివాడు ఏపని చేసినా అందులో నీ మనస్సుకు దుర్మార్గమే కనిపిస్తుంది. అంటే నీ మనస్సు చాలా జబ్బుస్థితిలో ఉన్నదన్నమాట. నీ మనస్సునుబట్టే ఎదటివారిలోని మంచి చెడ్డలు నీకు తెలు స్తుంటాయి. ఒక బాటసారిని చూచి దొంగ, జూదరి, తాగు బోతు, వ్యభిచారి. పరివ్రాజకుడు ఏమనుకొన్నదీ నువ్వు చిన్నప్పుడు చదివేఉంటావు. నిజానికి వాళ్ళందరనుకొన్నదీ నిజమే! వాళ్ళకున్న సంస్కార మటువంటిది. మరి నువ్విట్లా అనుకొంటున్నావంటే నీ సంస్కారా న్నేమని పిలవాలో నువ్వే చెప్పు!" అన్నాడు శంకరం కాసింత తీవ్రంగా.

సరోజిని వంచినతల ఎత్తలేదు. సమాధానమూ ఇవ్వ లేదు. నేలవేపు చూస్తూ నిలబడ్డది.

"అమ్మ చెప్పినా వినకుండా నువ్వు సన్నే చేసుకొం టానని మూర్ఖించావు. లక్ష కారణాలు మీ అమ్మ నీకు

చూపించేడుంటుంది. నువ్వు విన్నావా? లేదు. పది లక్షల కారణాలు చూపించినా వినవు. ఇంకా పట్టుబడితే, నాతో లేచివచ్చేదానివి. అవునా? ఎందుకలా మొఖం చిట్లించుకొంటావు సరోజా! నే నంటున్నది యిప్పటిసంగతి కాదు. అల నాటి విషయం. ఔనుగదా! అయినప్పుడు పదిలక్షల కారణాలు చూపించి, నువ్వు సత్యాన్ని ఆపగలవా? నువ్వు దేనినైతే లక్ష్యపెట్టలేవో, సత్యం దానినే లక్ష్యపెడతాడని నువ్వనుకోవటమే పొరపాటు. ఆ స్థితిలో ఎవ్వరున్నా అంతేనేమో! కాదుకూడదని సత్యంమనస్సు నెందుకు నొప్పించాలి? చేసేది సజావయినపని కాకపోయినా, అందులోనే రవంత నీతి తగులడేటట్లు చేస్తే బాగుండేది. నువ్వాపని చెయ్యలేవు. నేనుచేశాను. కర్మకాలి సుందరం రేపు కురూపిగానో, అంధురాలుగానో అయితే ఏమిటన్నాను. వాగ్దానమిచ్చాను. అవన్నీ సత్యం ఆచరిస్తాడని నేనెప్పుడూ అనుకోలేదు. ఇప్పుడూ అనుకోవటల్లేదు. కాకపోతే అతని కొక నూతన వివేచనమిచ్చాను. కేవలం ప్రేమమీదే కాకుండా, కొంత ఆత్మసంస్కారంగూడా కావాలన్నాను. అది యేనాటికైనా మీ అన్నకు మేలుచేస్తుందేగాని, కీడుచెయ్యదు. పోతే—" అని శంకరం ఆగాడు. అతనిగొంతు కొలమారింది. లేచి కూజావైపు నడుస్తున్నాడు. సరోజిని చప్పున వెళ్ళి వొక గ్లాసెడు నీళ్ళు వొంచి శంకరానికిచ్చింది.

పైన ఉండటం, కింద ఉండటం చాలా సాదామైన విషయం. మనలోమాట.. ఒక్కటడుగుతాను, నిజం చెప్పు సరోజా! మన పెళ్ళయిన కొత్తలో మన మీ పైభాగమే

కావాలని కోరుకున్నాము. మీ అమ్మ చెబితే నువ్వు విన్నావా? ఆమెతో పోట్లాడి మరీ ఈగది ఏర్పాటుచేశాను. అంటే కిందకంటే ఇక్కడేదో అధికం ఉన్నట్లుగా! ఆదే, మీ అన్నయ్యకు నేనిచ్చాను. సత్యంగూడా కుర్రవాడు. అందులోనూ ప్రేమించినపిల్ల. మన్మథుడు పట్టి దిక్కుమాలిన వెధవని నీకుమట్టుకు తెలీదా సరోజా?..."

ఈ మాటలు యింకెవరన్నా వింటే నవ్వేవారేమో గాని, సరోజినిమట్టుకు నవ్వలేదు. ఆమెముఖం కందగడ్డలాగా అయింది. కోపం కళ్ళల్లో బుసలుకొడుతోంది. గిరుక్కున తిరిగి, ఘరాలున కిందికి వెళ్ళిపోయింది. శంకరం నవ్వాడు.

ఒక రోజు మధ్యాహ్నం కిందనుండి ఏవో కేకలు వినిపించాయి. శంకరం చెవులు దొంగించి విన్నాడు. ఆ గొంతు రాజమ్మగారిది. ఆవిడ కూతురుమీద కేకలు వేస్తున్నది.

"బావుంది వరస. తండ్రి కొడుకుమీద - తల్లి కూతురుమీద" అనుకొన్నాడు శంకరం.

కిందనుండి సరోజినిగొంతు వినిపించింది. "నా వల్లగాదు; నే నీ చాకిరి చెయ్యను. నా వంట్లో నలతగాఉంది. చేతనయితే నీ కోడల్ని పిలిచి చేయించుకో. లేకపోతే పనిమనిషిని పెట్టుకో. ఈ రోజునుండీ నేను చిన్నమెత్తుపని ముట్టుకోను." అని తెగేసి చెప్పింది సరోజిని.

"ఒక్కదానికీ ఈ పనంతా అవుతుందిటే?" అన్నది రాజమ్మ.

"కాకపోతే నీ కోడల్ని పిలుచుకో." అన్నది సరోజిని.

ఈ మాటలన్నీ శంకరానికి వినపడ్డాయి. "దిక్కుమాలిన అసూయలు. తనకంటే సుందరం సుఖంగా ఉంటున్నదని ఇది యేడ్చిపోతోంది. తనుమాత్రం సుఖంగా ఎవరుండొద్దన్నారు?" అనుకొన్నాడు శంకరం.

ఇది జరిగిన రెండు మూడు నిమిషాల కల్లా సరోజిని పైకి వచ్చి, సత్యంగదిముందు నిలబడి, "వదినా! మా అమ్మ పిలుస్తున్నది" అన్నది.

సుందరం వాకిట్లోకి వచ్చి "ఎందుకూ?" అన్నది.

"ఏమో తెలీదు. వెంటనే రమ్మన్నది"

"ముందు నువ్వెళ్ళి, ఆ పనేమిటో కనుక్కొనిరా. ఆ తరువాత దానికోసం నేను రావాలో రానక్కర్లేదో చెబుతాను." అన్నది సుందరం.

సరోజినికి కోపం వచ్చింది.

"మరేమీ లేదు వదినా! నా కేమో ఒంట్లో సుస్తీగా ఉన్నది. ఇంతెడు చాకిరీ అమ్మ వొక్కతే చెయ్యలేదు. కాస్త చెయ్యి ఆసరాగా ఉండటానికి రమ్మంది" అని అసలు సంగతి బైటపెట్టింది సరోజిని.

"ఈ మాట చెప్పడానికి, నీ కేమీ తెలియదంటావేం?—వెళ్ళు. నేను రానని చెప్పు" అన్నది సుందరం.

సరోజిని హడలిపోయింది. సుందరం ఇటువంటి మాట అంటుందని ఆవి డెప్పుడూ అనుకోలేదు. తనను చేసుకోవద్దని సత్యంతో చెప్పినందుకుగాను, పగతీర్చుకొంటున్న దానిలా కనిపించింది సుందరం. అయితే శంకరం తన ప్రయత్నంలో కృతకృత్యు డవుతున్నాడన్నమాటే!

"అట్లా చూస్తావేం సరోజా! నేను రానని చెప్ప లేదూ? వినపడలేదా యేం?... నువు మిర్రి మిరి చూచినంత మాత్రాన నా కేమీ భయంలేదు. నే నేమీ దాసీదాన్ని కాను పనిచెయ్యటానికి. పెద్దది—అత్తగారికి తెలియకపోతే- కనీసం నువ్వైనా చెప్పి ఉండవలసింది. కాకపోగా - నువ్వే నన్ను పనిచెయ్యటానికి రమ్మంటున్నావు. ఏమిటిది?" అన్నది సుందరం గవంత కంఠం పెద్దదిచేసి.

సరోజిని యిక కోపం ఉంచబట్టలేకపోయింది. నాపు లోనే శంకరంగది ఉన్నది. బహుశః అతను మాటలన్నీ విన్నా వినవచ్చు. ఎంత అవమానం!!

"అయితే- నువ్వింటిని పరిపాలిద్దామని వచ్చావా వదినా?" అన్నది సరోజిని.

"కాదు. ఆ శాకరబందీమట్టుకు నాకెందుకు? నా కట్లాంటి బాధ్యతలేమీ లేవు."

"అయితే నీకున్న బాధ్యతలేమిటో చెప్పు. ప్రతిదానికీ నిన్ను పిలవకుండా- నీ బాధ్యత వొచ్చినప్పుడే పిలుస్తుంటాను. అనవసరమైన శ్రమ నాకూ కొంత తప్పుతుంది" అన్నది సరోజిని కసిగా.

"నా విషయంలో నీ కే శ్రమా అక్కర్లేదు సరోజా. నా బాధ్యతలేమిటో నాకు తెలుసు. అవి నీవు జ్ఞాపకం చేయ నవసరంలేదు." అన్నది సుందరం.

"ఇన్నిటికీ నువ్వు పనిచెయ్యటానికి రానట్లేగా సుంద రం? ఇది ఖరారేనా?" అన్నది సరోజిని.

"రాను. రావలసిన అవసరం నాకు లేదు. పదివేలు పెట్టి నేను మొగుణ్ణి కొనుక్కున్నాను. ఆయన ప్రాధేయపడ్డాడు గనుక– కొంతకాలం ఆయనింట్లో ఉండటానికి ఒప్పుకొన్నాను. ఇక్కడ ఉండటానికి నాకు మనస్కరించకపోతే ఆయన్ని చేతపట్టుకొని యింకోచోటికి వెడతాను. నా వస్తువును కొన్నది నేను. కేవలం అతిథిగా నేనిక్కడ ఉంటున్నాను. నన్ను పనిచెయ్యమనటానికి ఎవ్వరికీ హక్కు లేదు. ఆ మాటకొస్తే మీరంతా కలిసి నాకు చాకిరీ చెయ్యాలి. ఎందుకంటారా?– నా పదివేలూ మీరందరూ కలిసి తింటున్నారు గనుక. అర్థమైందా వదినమ్మా?"

సుందరం గొంతు ఆగింది. ఘంటానాదం తరువాత దేవాలయంలో ఉండే ప్రశాంతతలాంటిది అక్కడ వెలిసింది. సుందరం చెమటతుడుచుకొంటూ లోపలికెళ్ళి తలుపు వేసుకొంది. సరోజని బిక్కచచ్చిపోయి వెనక్కి మళ్ళింది. మెట్లు దిగుతున్నప్పుడు శంకరంనవ్వు ఆమెకు వినిపించింది. అక్కడే కుప్పలాగా కూలబడ్డది సరోజని.

అయితే ఈగొడవ యింతటితోనే అయిపోలేదు. అమ్మా, చెల్లెలూ కలిసి సత్యానికి బాగా నూరిపోశారు. వాడు పెళ్ళాంమీద ధామధూములు చేశాడు. సుందరం జంకలేదు. అన్నమాట అన్నానని ఒప్పుకొన్నది.

"ఎందుకన్నావ్?" అన్నాడు సత్యం కోపంగా. అట్లాంటిగొంతు సత్యానికున్నదని – సాధారణంగా ఎవరూ అనుకోరు.

"నేను పనిమనిషినికాను గనక - కానని చెప్పాను. కాకపోయినా, అవునని చెప్పినట్లయితే, మీకు సంతోషంగా ఉండేది కదూ?" అన్నది సుందరం.

"వాళ్ళమనస్సు నెందుకు కష్టపెట్టాలి? పోనీ పదినిమిషాలు అటూ ఇటూ చెయ్యాడించివస్తే తీరిపోయేది... అయినా ఈమధ్య సి నోరు మరీ పెచ్చరిల్లిపోతోంది. దానికొకసారి తగినశాస్తి చేయాలి. లేకపోతే అది ముందుముందు మరీ పెచ్చరిల్లిపోతుంది" అన్నాడు సత్యం.

"మనస్సులనేవి అందరికీ వొకటే!" అన్నది సుందరం. "నా మనస్సును వాళ్లుమాత్రం కష్టపెట్టవచ్చా? ఈ లెక్కప్రకారంచూస్తే, మీవాళ్ళ నోళ్ళుగూడా పెచ్చరిల్లిసయ్యనేగా..."

"సుందరం!" అని గట్టికేకా, ఆ వెంటనే దెబ్బా శంకరానికి వినిపించాయి.

అతను బైటికి వచ్చాడు. అప్పటికే సత్యం గదివెలుపలికొచ్చి నుంచున్నాడు. శంకరం అతన్ని రెక్కపట్టుకొని పిట్టగోడు దగ్గరకు తీసుకొచ్చాడు. ఇద్దరూ అక్కడ చతికిలబడ్డారు.

"ఇంద! సిగరెట్టు కాల్చు." అన్నాడు శంకరం తనొకటి నోట్లో పెట్టుకొని, పెట్టె సత్యంవేపు చాస్తూ.

"నాకొద్దండీ!" అన్నాడు సత్యం దిగులుగా.

"ఫరవాలేదు కాల్చు" అని తను ముట్టించి అగ్గిపుల్ల సత్యానికిచ్చాడు. సత్యం ముట్టించనేలేదు. శంకరంగూడా బలవంతంచెయ్యలేదు.

ఆకాశంనిండా చీకటి తెర కప్పుకొంది. వడగళ్ళలాంటి చుక్కలు కునుకుతున్నాయి. సన్ననిగాలి, బరువైన ప్రశాంతత.

శంకరం మెల్లగా గొంతు విప్పాడు.

“నువ్వు పిరికివాడివి సత్యం! నువ్వు దేన్నిగురించీ ఆలోచించవు. నీ కది చాతకాదు. నీ సంస్కారంగూడా అంతే మంచిదిగాదు. నువ్వొకనాడు నా గదిలో కూచుని ఏమిటేమిటో అన్నావు. అవన్నీ నువ్వు చేస్తావని నే నేనాడూ అనుకోలేదు. కానీ, అట్లాంటి జ్ఞానవాహినులు ఉన్నాయన్నైనా నీకు తెలిసినందుకు సంతోషిస్తున్నాను. అందుకే, అప్పుడే నేనన్నాను; ‘నువ్వనుకున్న ఆచరణలో పెట్టగలిగితే...’ అని.

“సుందరంకోసం అమ్మనూ నాన్ననూ, అన్నిటినీ వదులుతానన్నావు. ఆమె సుఖమే నీ సుఖమన్నావు. ఆమె సుఖపడటంకంటే నీకు కావలసిందేమీ లేదన్నావు. మాటవరసకు నీటిల్లో వాక్యాల్ని నువ్వు ఆచరించావా? సుందరానికి ఊరికే అట్లా కూచోవటం సుఖం. ఆమె సుఖాన్ని కోరుకున్న నువ్వు చేసిందేమిటి? ఆమె చెయ్యనన్న పనిని ఎందుకు చెయ్యలేదని అడుగుతున్నావు. నీకు అంతరాత్మ అంటూ ఒకటి లేదు. ఉన్నా దానికి అభిమానం లేదు. ఆత్మాభిమానమున్న ప్రతివాడూ, ఎదటివారి ఆత్మాభిమానాన్ని కించపరచాలని చూడడు. ఎవరినుంచైనా దానికి అపాయం వచ్చేటట్లు ఉంటే ఎదుర్కొంటాడు. ఒకరకంగా చూస్తే సుందరం నిన్ను పదివేలకు కొన్నట్లు! ఆ మాటే ఆమె అన్నది. తను నిన్ను కొన్నదిగనక, పనిమనిషిలాగా చాకరీ చెయ్యమన్నది. ఆమాత్రం ఆత్మాభిమానం ఆమెలో

ఉండటం నువ్వు సహించలేదు. ఎందుకంటే నీకది లేదు. ఉంటే దానివిలువేమిటో గ్రహించేవాడివి...

"నిన్నూ సరోజనూ నేను అర్థంచేసుకున్నాను. మీ అంత స్వార్థపరులు ఇంకొకరు లేరు. సుందరాన్నితప్ప ఇంకొర్ని చేసుకోనని నువ్వన్నావు. శంకరాన్ని తప్ప మరొకర్ని చేసుకోనని సరోజిని అన్నది. అట్లా పట్టుపట్టుడంవల్ల ఇతరులెంత ఖేదపడవలసివస్తుందో మీ రాలోచించరు. మీకు కావలసిందల్లా మీ సుఖం! మీ సౌభాగ్యం!! మీ మనస్సులకు బాగా జబ్బుచేసింది. అవి ప్రతివారిలోను, ప్రతిదాంట్లోను తప్పులే చూస్తున్నాయి. సాధ్యమయినంత త్వరలో వాటిని బాగుచేసుకోండి. లేకపోతే అవి విషఫలితాలనిస్తాయి. అవి బాగుపడ్డదాకా మీరు సుఖపడలేరు. మరొకర్ని సుఖపడనివ్వరు. ఎదటివారికోసం కాకపోయినా, కనీసం మీకోసమన్నా వాటిని కాస్త శుభ్రంచేసుకోండి..."

సత్యం వంచినతల యెత్తలేదు. శంకరం యెత్తినతల దించలేదు.

"చాలా పొద్దుపోయింది. వెళదాం లే!" అన్నాడు శంకరం.

సత్యం నిర్జీవంగా లేచాడు. గాలిలో తేలిపోతున్న వాడిలాగా మెట్లుదిగి కిందికి వెళ్ళిపోయ్యాడు. శంకరం తన గదిలోకొచ్చి తలుపుకు గడియవేశాడు. మరో పావునిమిషం తర్వాత – సుందరం గడియవేసుకొంటున్నట్లుగా శంకరానికి వినిపించింది.

ఉదయం ఎనిమిది గంటలు కొట్టింది గడియారం. సరోజిని తుళ్ళిపడి లేచింది. ఇంతసేపూ ఆమె-రాత్రి శంకరం చెప్పిన మాటలనుగురించే ఆలోచిస్తున్నది. ఆలోచించిన కొద్దీ, అవన్నీ నిజంగానే కనిపిస్తున్నాయి సరోజినికి. ఏదో శక్తి నిద్రి మేలుకొంటున్నట్లుగా ఆమె భ్రమించింది. బహుశః అది నిజమే కావచ్చు.

చప్పుచప్పున టిఫిను, కాఫీ, మంచినీళ్ళు పట్టుకొని ఆమె మేడమీదికొచ్చింది. శంకరం గదితలుపు దగ్గరగా వేసి ఉంది. ఇంకా నిద్ర లేవలేదుగాబోలు. రాత్రిల్లా ఈవిషయం గురించే వీరూ ఆలోచిస్తున్నారేమో! శంకరాన్ని దభాటుగా లేపబుద్ధికాలేదు. జాగ్రత్తగా పళ్ళాన్ని పట్టుకొని, మెల్లిగా - కాలితో తలుపును త్రోసింది. శంకరం లేడు. బహుశః- పళ్ళుతోముకోవా- ఆమూల కెళ్ళాడేమో! సరోజిని టిఫిన్ పళ్ళాన్ని మేజామీద పెట్టి, గది బాగుచేద్దామనుకొన్నది ఆమె కంటికి శంకరం తాలూకు వస్తువు ఒక్కటికీ కనపడలేదు. కళ్ళు తుడుచుకొని మళ్ళీ చూచింది. చూచినా లేనివస్తువు లెట్లా కనిపిస్తాయి? దురదృష్టవశాత్తూ సరోజినికొక దౌర్భాగ్యపు టనుమానం కలిగింది. ఆమె చకచకా వెళ్ళి సుందరంగదితలుపులు నెట్టింది. ఆ వెంటనే సరోజిని కొయ్యలాగా నిలబడిపోయింది. పాపం! సరోజిని!!



# సొలెగూడు

గత మూడు నాలుగు రోజులనుండీ సావిత్రి మనస్సు పూర్తిగా స్థిమితం కోల్పోయింది. ఆమె దిటవు తెచ్చుకోవటం కోసం చాలా ప్రయత్నాలు చేసింది. చేస్తున్నది. కానీ లాభంలేదు. సావిత్రి ఈ చిక్కులోనుండి బైటికి రాలేదు. ఎందుకంటే—పాపం! సావిత్రి కిది జీవన్మరణ సమస్య.

ఆమె కాపరాని కొచ్చి రెండు నెలలయినా కాలేదు. భర్త మనస్తత్వం ఎటువంటిదో ఆమెకు తెలీదు. ఒకవేళ తెలుసుకొనేందుకు ప్రయత్నించినా అందువల్ల ఆమె ఆశించిన ఫలితం రాదు. వచ్చినా అది ఆమెకు సంతృప్తి నివ్వలేదు. ఇచ్చినా ధైర్యంచేసి సావిత్రి ఆ 'ఫలితాన్ని' ఆచరణలో పెట్టేందుకు సిద్ధంగాదు. ఎందుకంటే, సావిత్రి ఒక రకమైన సంస్కారంలో పెరిగింది; ఆమెప్రపంచంలో మొగవాళ్ళంతా అదృష్టవంతులు. వాళ్లు పూర్వజన్మలో గొప్ప పుణ్యం చేసుకొన్నారు. అందుకనే పురుషులుగా జన్మించారు. మరి పూర్వజన్మలో పుణ్యంచేసి ఉత్తములుగా జన్మించినవాళ్ళు, యిప్పుడు గూడా ఉత్తములే గదా! అటువంటి ఉత్తములకు ఎక్కువ అధికారాలు, హక్కులు వుండటం చాలా సహజం. ఆ హక్కులను వాళ్ళు యథేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. తను స్త్రీ. అసలు స్త్రీజన్మే ధిక్కరించాలిన జన్మ. తనకు తెలీదుగనకనా, ఆడదై పుట్టుటకంటే అడివిలో మ్రానై పుట్టటం చాలా మంచిదని.

ఆడవాళ్లు ఇప్పుడు గాకపోవచ్చు—పూర్వజన్మలో వాళ్లు దరిద్రులు. అందుకే ఆ పాపఫలాన్ని ఈ జన్మలో ఈ 'రూపం' ఎత్తి అనుభవిస్తున్నారు. ఈ రకం సంస్కారంగల సావిత్రి, ఒకవేళ భర్తమనస్తత్వాన్ని కనుక్కొన్నా, అది ఆమె అద్దంరంగులాగానే కనిపిస్తుంది. భర్త తత్వం అందుకు భిన్నమే కావొచ్చు. కానీ అభిన్నత్వాన్ని ఆకళింపుచేసుకోగల ప్రజ్ఞ సావిత్రికి లేదు.

ఇంకా నయం! తను చాలా అదృష్టవంతురాలు. చలపతి ఆ 'పాడు పని' చేస్తున్నప్పుడు ఎవరన్నాచూస్తే? ఇక తన బ్రతుకేమిటి? తన భవిష్యత్తేమిటి? ఏముఖం పెట్టు-కొని... ఒకవేళ పుట్టింటికి వెడితేమట్టుకు? నాన్నా అమ్మా అంగీకరిస్తారా? అమ్మ అంగీకరించవొచ్చు—స్త్రీగనక. కానీ నాన్నకాదు. ఎందుకంటే నాన్న మొగవాడు. నీతివిషయకంగా మొగవాళ్ళంతా ఒకటే! రాజకీయంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా తలలు బద్దలుకొట్టుకొనే భేదాలుండొచ్చు. కానీ ఒక 'స్త్రీ' విషయం వొచ్చేసరికి అందరూ ఒకేదారిని నడుస్తారు—వ్యాపార సమయంలో ఎన్ని పోటీలు పెట్టుకొన్నా, కార్మికుల్ని అణచడంలో యేకమయ్యే పెట్టుబడిదారుల్లాగా.

తనేం చేయాలి? ఎట్లా ఈ పీడ వొదిలించుకోవాలి? అప్పటికీ ఎంత అవసరమైన పని వున్నప్పటికీ తనా దొడ్లోకి పోవటంలేదు. ఏముందీ! పోగానే ఆ చలపతిగాడు బాదం చెట్టుకింద సిద్ధం. వెధవజూలూ వాడూనూ. ఏమిటి తనవేపు అట్లా చూస్తాడు? తనెవరనుకొన్నాడు? అట్లా వాడు చూడటానికి ఎన్ని గుండెలుండాలి? వెధవ నిన్నా మొన్నా

బెడ్డలు విసరడంగూడా సాగించాడు. వాడికీ ధైర్యం ఎవ రిచ్చారు? ముందుగా— వా డా వెకిలినవ్వులు నవ్వుతున్న ప్పుడే 'వారితో' చెప్పినట్లయితే! చక్కగా నాలుగుతన్ని ...

...సావిత్రికి మంచి కలవొచ్చింది. ఆ కలనిండా ఎంత సౌందర్యం వుంది! యెంత హాయిగావుంది! రోగాలతో, సంఘర్షణలతో, దరిద్రంతో, మనస్పర్థలతో, యుద్ధాలతో మురిగి గవులుకొట్టే దిక్కుమాలిన వాస్తవిక జీవనం కంటే స్వప్నజీవితం యెంత ఉత్తమమైనది! ఈ లోకం లోకి రాకుండా, యెప్పుడూ ఆ కలల ప్రపంచంలోనే వుండే ఏర్పాటులుంటే! ఆ కల అట్లా ఆమె మెదడులో, రక్తంలో, మెల్లిగా కరిగి ఇంకుతున్నది... చప్పుడు—ఆ కల లోనే వ్యక్తావ్యక్తంగా చప్పుడు వినిపిస్తున్నది. సుందరమైన ఆ ఆకుపచ్చని స్వప్నం, మెల్లగా బూడిదరంగుగా మారి, పలచబడి, పొగలాగా 'థీఫ్ ఆఫ్ బాగ్దాద్'లోని సీసా భూతంలాగా, చివ్వున కుంగి చీకటి ఆగింది చిక్కగా. సావిత్రి లేచింది. ఎదురుగా తగ్గించిన చిమ్నీ, పక్కగా తననడుం మీద చెయ్యివేసిన భర్త. ఏమిటా వెధవచప్పుడు? అది తన మంచి కలను చిదిమివేసింది. కాసేపు ఆ కలను తలుచుకొని, నిట్టూర్చి సావిత్రి కళ్లుమూసింది. ఇంకా నిద్రపట్టలేదు. మళ్లీ అదేచప్పుడు. ఈసారి ఇంకా స్త బిగ్గరిగా. ఆమె మెడతిప్పి చూస్తే అది కిటికీలోనించని తోచింది. ఆమెగుండె బెదిరింది. కిటికీలోంచి యేదో చెయ్యి ముందుకొచ్చి తనను రమ్మని పిలుస్తున్నది. ఎవరి దా చెయ్యి! "దొంగదొంగ దొంగ"అని అరిచింది. కానీ ఆ అరుపు పైకిరాలేదు. తనలోతనే అరుచు

కొన్నది. ఒళ్ళంతా చెమటలుపోసినాయి. ఈ సమయంలో భర్త లేస్తే! దీక్షగాచూచింది. ఆ ముఖం చలపతిది. చుక్కల వెలుతురులో స్పష్టాస్పష్టంగా గుర్తించింది. ఇంకేం, భర్తను లేపుతుంది సావిత్రి. లేపి ఏమని చలపతిని చూపుతుంది? చూపినా ఏమని చెబుతుంది? చెప్పినా చలపతి 'దొంగతనం' కోసం వొచ్చాడని ఆ భర్తప్రాణి నమ్ముతుందా? చలపతి చాలాకాలంనుండీ ఆ పక్కయింట్లో ఉంటున్నాడు. అతను మర్యాదస్తుడూ, పెద్దమనిషీ అని ప్రతీతి వుంది. భర్తగారే ఎందుకో నాల్గైదుసార్లు ఆ మాట అన్నాడు. అటువంటి "ఉత్తమ" వ్యక్తిని పట్టుకొని తను 'దొంగ' అని రుజువు చెయ్యగలుగుతుందా?

'చిన్నమాట' అన్నాడు చలపతి చెయ్యిపూపి.

సావిత్రి ప్రాణాలు మూలిగాయి. భర్త లేస్తాడేమో! ఆ చెయ్యి అట్లా లోపలవుండి తను మేలుకొనివుండటమే ఆయన కంటబడితే! ఇంకేమయినా వుందా? కదలకుండానే వెళ్ళిపొమ్మని చెయ్యిపూపింది. కానీ అతను కదలలేదు.

"పోను, ఇట్లా రా! చిన్నమాట" అన్నాడు మెల్లిగా.

ఆమెకు చెమటలుపోస్తున్నాయి. ఒణుకుతోంది.

"ఫో" అని మెల్లిగా కసిరి ముఖంనిండా దుప్పటి కప్పుకొన్నది. ఈసారి చప్పుడు మరీ ఎక్కువైంది. పెద్దగా పిలుస్తున్నాడు. చిన్న చిన్న గులకరాళ్ళు మీదకు విసురుతున్నాడు. ఇక లాభంలేదు. తను తప్పక వెళ్ళాలి. ఒక్కసారి వెళ్ళి ఆ 'పీడ' వొదుల్చుకుంటే తీరిపోతుంది. తనను పూరికే రమ్మనమనేగదా అతను కోరింది. వెడితే సరి. తీరిపోతుంది.

మంచంమీదినుంచి లేచింది. దుప్పటిని భర్తముఖానికి కప్పింది. కిటికీదగ్గరికి వొచ్చింది వణుకుతూ సావిత్రి.

"ఏమిటి?" మెల్లగా అన్నది.

"నువ్వు...నువ్వు" గొణుగుతున్నాడు.

"సరేలే, పో"

"ఎక్కడికి?"

"ఫో...ఆయన లేస్తారు"

వెనక్కు తిరిగి చూసింది భయంగా

"లేవడు—అయినా లేవనీ."

"తలుపు లేస్తాను."

అని కిటికీ మూయ్యబోయింది. చప్పున ఆమె చేతిని పట్టుకొన్నాడు చలపతి.

"ఎంత మెత్తగా ఉంది నీ చెయ్యి"

"వుంటె వుందిలే విడువు"

"ప్రతిరోజూ ఈ చేతిని తాకే నీ భర్త ఎంత అదృష్ట వంతుడు...!"

చెయ్యి లాక్కోబోయింది. చలపతి గట్టిగా పట్టుకొన్నాడు. వొదలడు. వొదలలేడు. సావిత్రి అతని స్వప్న సుందరి. ఆమెను తొలిరోజుల్లోనే వాంఛించాడు. ఆ వాంఛ కామమో, ప్రేమో, మోహమో అనే నీరస సందేహాలు అతనికి రానేలేదు—అదృష్టవంతుడు, శక్తివంతుడూ కనక. ఏదో ఒక కార్యాన్ని గట్టిగానమ్మి, విధిగా ఆచరించే ధీరులకు ఏ సందేహాలు, ముందు వెనకలు రావు. ఏదీచెయ్యలేక, చేసే ధైర్యంలేక, చెయ్యకుండానూ వుండలేక, లోపల ఆత్మ పెట్టే

అలజడిని తట్టుకోలేనిగుంపు "ఇది మంచా? అది మంచా?" అని చొంగలు కారుస్తూ కాలం గడపగలరు. ఇదంతా ఆ కార్యం లోకి తాము ధారాళంగా లీనం కాలేకపోవటమేనని వాళ్ళకు తెలీదు.

చలపతి తన వేళ్ళకింద పొంగే ఆమె నెత్తురు వేడిని అనుభవిస్తున్నాడు సంతోషంగా. కానీ అతనికి సంతోష దాయకమైన ఆ స్థితి ఆమెను ఖిన్నురాలినిగా చేస్తున్నది.

"సిగ్గు —— వారు చూస్తే ... బాగుండదు" అన్నది ఏడుస్తూ.

"ఉంటుంది. పోనీ బాగుండదూ? మరీ మంచిది. నావాళ్ళు నేనూ యుద్ధం చేస్తాం. ఎవరు చూస్తే వాళ్ళు నిన్ను ..."

ఎంత కవిత్వం కుమ్మరిస్తున్నాడు చలపతి—ఆమె ముందు! అతను తెలుసుకున్నట్లే చదువడు మళ్ళీ.

"ఇక్స్. సరసమాడను ... గట్టిగా పట్టుకున్నా, ఈ చువ్వలు విరిచివచ్చి నిన్ను పోదాం రావాలనిపిస్తుంది నాకు ... అదీ! అట్లా కృత్రిమంగా ముఖం పెట్టుకో ... ఇదుగో ... ఏం లేదు, దగ్గరికి రా. చిన్నమాట ఇప్పుడే పోదువుగాని ..."

"ఇప్పుడు వద్దు. రేపు పగలు నీళ్ళకోసం వచ్చినప్పుడు చెప్పు. ఇప్పుడైతే వారు చూస్తారు" అన్నది సావిత్రి. అతనికి చిన్న ఆశ చూపించి ఈ గండం ఈ రాత్రి తప్పుకొందామని. కాని చలపతి పరాక్రమం ——

"ఇప్పుడానికి సిగ్గా. రేపు పగలు అందరూ చూస్తారు నువ్వు నాతో మాట్లాడటం. ఇప్పుడు ఐతే

ఎవ్వరూ చూడరు. ప్రమాదంలేదు.... అయినా! చూస్తే అతనొక్కడేగా. ఫర్వాలేదు" అన్నాడు.

"రాను ...పో" బిగ్గరగా అరవాలనుకొన్నదిగానీ, సహజమైన పిరికితనం ఆపింది.

"అయితే నేనే వొస్తాను."

అని కిటికీ చువ్వలు విరుస్తున్నాడు. ఆమెకు కాళ్ళు వొణికాయి.

"పెద్దగా అరుస్తాను" అన్నది ఆఖరిబెదిరింపుగా, దీనితో అతను జంకుతాడని నమ్మి.

"ఏమని?"

మళ్ళీ మొదలు.

"నువ్వు...వొచ్చి—"

"ఊఁ, వొచ్చి? చెప్పు. వొచ్చి ఏం చేస్తున్నానని అరుస్తావు?"

ఏం చేస్తున్నాడని అరుస్తుంది? దానివల్ల ఎవరికినష్టం? ఆపదలోవుండి తను పెట్టిన ఆ ఘోష యమపాశమై ఎవరి కంఠాన్ని చుట్టుకొంటుంది? పరువుకోసం, మర్యాదకోసం, హోదాకోసం మేడలు, కార్లు, పరువులు తగిలించుకొన్నట్టు గానే, భార్యను గూడా మేపే, ఈ లక్షలాది భర్తలు ఆ భార్యచేసిన ఆర్తనాదంవల్ల తమ గాలి పరువులన్నీ బద్దలై పోవటం సహిస్తారా? వారి వారి విజ్ఞానాన్ని బట్టి సంస్కృతిని బట్టి, మేధాసంపత్తినిబట్టి గౌరవంవుండటం సహజమైన విషయం. కానీ ఈ దేశంలో మొగవాళ్ళ గౌరవాగౌరవాలు స్త్రీప్రవర్తనమీద ఆధారపడి వుంటాయి.

ఇంక గత్యంతరంలేక వొప్పుకుంది దొడ్లోకి రావ టానికి.

"నిన్ను నమ్మి చెయ్యి వొదులుతున్నాను. రాకుండా మోసం చేశావో. రేపు నీ పని...?"

అని పక్కకు వెళ్లాడు చలపతి.

సావిత్రి కిటికీ మూసింది. చప్పున భర్తపక్కనే పడు కొంది. దుప్పటి నిండా ముసుగుపెట్టుకొంది. ఇంకా చలి వేస్తూనేవుంది. చమటపోస్తూనేవుంది. పోగూడదని దృఢంగా నిశ్చయం చేసుకొంటుంది. కాని పోకుండావుంటే? మరి వాడు ఏంగోలచేస్తాడో? కేశవరావు, సుమతిని గురించి గోడలమీద ఏదో 'బూతు' కాగితం అంటించినందుకేగా దాని మొగుడు దాన్ని విడిచిపెట్టింది! పుట్టింటిలో సుమతిని ఎంత నీచంగా చూసేవాళ్ళో తనకు తెలుసు. ఒకవేళ ఇప్పుడు పోకుండావుంటే, తనగతిగూడా అంతేనేమో! ఈ ఆలో చనతో ఆమెనెత్తురు చల్లబడింది. పోవాలో వద్దో, ఏం చెయ్యాలో తెలీటల్లేదు. మళ్ళీ తలుపుమీద దడదడ చప్పుడు. మెదడు బిగిసి, ఆలోచనరాక... లేచింది. తలుపుతీసి బైటి కొచ్చింది. చప్పున బైట గొళ్ళెంపెట్టింది. చలపతి ఆమెను బాదంచెట్టువేపుకు లాక్కుపోతున్నాడు.

'ఏమిటి?' అన్నది దూరం జరిగి.

'నువ్వు-నిన్ను-ప్రేమిస్తున్నాను' అనికావిలించుకొంటు న్నాడు. సావిత్రి దూరంగా తోసింది.

"అట్టా మీదికొస్తావెందుకు? దూరంగావుండి చెప్పు ఆ చెప్పేదేమిటో?"

"ఏం చెప్పను. నిన్ను చూసి..." అని ఆగి "నువ్వు కావాలి" అని గొణిగాడు.

పెద్ద షాక్ తగిలినట్లయింది ఆమెకు. అతను చప్పున ఆమె భుజం పుచ్చుకొని లాగి, వొంచాడు.

'వొదులు—పోతాను'

'నా ప్రాణం పోయినా వొదలను.' అతని కంఠంలో నిశ్చయం మ్రోగింది.

'ఏం లాభం? ఎందుకు నన్నిట్లా బలవంత పెట్టటం? నన్ను చిక్కుల్లో వొంచి హింసించి, ఏం ఆనందపడతావు నువ్వు?'

'అది తేల్చుకోవలసింది నేను. నాకిష్టమైనప్పుడు...'

'నేను ఇంకొకరి భార్యను. ఇతరుల వస్తువులను కోరటం తప్పుగాదూ?'

ఎంత హానిసత్యం! జ్ఞానం గలిగి, మానవజన్మ ఎత్తి గూడా, ఇతరులకు వస్తువునని చెప్పుకొంటున్నది సావిత్రి! ఈ గొడ్డుగుణాన్నే గావును పాతివ్రత్యమని ముద్దులు వేసుకొంటారో, చెప్పుకొనేది. ఇటువంటి అమాయకులను, ప్రాణమున్న బొమ్మలను, కాలికింది చెప్పులను, పవిత్రమైన భార్యలుగా చెప్పుకోనటానికి వీళ్ళెందుకు సిగ్గుపడరో!

'కాదు. తప్పేఅయితే, ఆ కోరిక అసలు నాకు కలగకుండానే వుండేది. నాచేత ఇంత సాహసం చేయించకపోను మరి—గడ్డితినాలని, బురదలో దొర్లాలని, నిప్పు మింగాలని, కారుకింద పడాలని, మునగగొండాకు వొంటికి రుద్దుకోందామని నాకు అనిపించదేం మరి?... ఎందుకంటే అవి తప్పులు

గనక. కానీ నువ్వు అందంతో నన్ను ఆపావు. అప్పుడే నీ మీద ప్రేమ కలిగింది నాకు' అని ఆమెను తాకుతున్నాడు. సావిత్రి అతని చేతుల్ని దూరంగా నెట్టింది కోపంతో.

"నువ్వంటే అసహ్యించుకొంటున్నాను నేను. అటు వంటి మనిషిని ఎందుకు బాధిస్తావు? నా హృదయం నిన్ను వ్యతిరేకిస్తున్నది. వొట్టి శరీరాన్ని..." ఆమె మాటలు వొణుకుతున్నాయి.

"ఆ హృదయాన్ని పవిత్రమైన, నిర్మలమైన నీ భర్త గారి పాదసరోజాంకితంచేసి, ఈ దిక్కుమాలిన బొందెను నా కివ్వు, చాలు...హృదయం, శరీరం, ప్రేమ, కామం వొట్టి నిరాధారమైన భేదాలు. స్త్రీపురుషుల మధ్యగల ప్రేమకు ద్వారం హృదయంలోకాదు శరీరంలోనే. ఏ ప్రేమ, ఏ అనురాగం, ఏ నిష్కల్మషం యెంత వొత్తి వొత్తి తూచి తూచి కులుకుతో అంటేనేం? ఆ ప్రేమను నిరూపించుకోనేం దుకు, వ్యక్తంచేసుకొనేందుకు ఈ శరీరాలుతప్ప వేరు సాధ నంలేదు. ఈ వినిర్మల, స్వచ్ఛంద, నకిల్బిష ప్రేమవాదు లంతా, హృదయాలను తాము స్వీకరించి, నీచమైన, తుచ్ఛ మైన, అశాశ్వతమైన ఈ తోలుగూడును, యింకొకరికి తమ స్త్రీలు యిస్తే గోంగ్రుమంటారెందుకు? అంటే తాము చెప్పే దాంట్లో తమకే నమ్మకం లేదన్నమాటేగదా!"

ఈ భావాలు ఆమెను కదిలిస్తున్నాయి. తనలోకి నూత్న ప్రపంచాలను ఆవిర్భవింపచేస్తున్నాయి. ఆ క్రొత్త లోకాల సందర్శనం ఆమెను వెర్రి ఆనందంలో, గొప్ప సందే హంలో వూపుతున్నది.

"నువ్వు నన్ను ఇంద్రజాలంచేస్తున్నావు, మోసం చేస్తున్నావు. నేను నీకు చిక్కను" అని మూలిగింది ముఖానికి చేతులు కప్పుకొని సావిత్రి.

"చిక్కనా? పోతావా?"

"అవును"

'ఇంక నీగతి ... సరే! రేపు తెల్లారేటప్పటికి నిన్ను ..

"ఏం చేస్తావు నన్ను?"

"ఎందుకూ చేననటం? నీకే తెలుస్తుందిగా"

ఆమె భయపడింది. చుట్టూ కమ్ముకొనే దావాగ్నిలో చిక్కిన లేడిపిల్లవలె ఆమె సంక్షుభితపడసాగింది.

"నువ్వు నన్ను రమ్మన్నావనీ, నాకు ఉత్తరాలు రాస్తున్నావనీ నీ మొగుడితో చెబుతాను. లేదూ? ఆ వెంకటనరసయ్యతో ఉండగా చూశానంటాను. ఏమవు తావో చూసుకో మరి?" అని పోబోయినాడు. సావిత్రి అతని చొక్కా పట్టుకొని ఆపింది.

"ఉండు., చెబుతావా అట్లా? చెప్పు చెప్పు; ఊహూ. వొద్దు వొద్దు. చెప్పకు. చెప్పినా ఆయన నమ్మడు. నే నంటే ఆయనకు చాలా ఇష్టం. నమ్మనే నమ్మడు. అప్పుడు నువ్వే—నిన్నే తంతాడు. గొంతు నులిమి, విరిచి, కుప్పలాగా వేస్తాడు."

"నీకు నీభర్త సంగతి తెలీదు. నువ్వేమిటిలే, చాలా మందికి తెలీదు, ఎన్ని సంవత్సరాలు కాపరం చేసినా సరే! భార్య శీలం విషయంలో మొగవాళ్ళను నమ్మించటంఅంత సులభం ప్రపంచంలో ఇంకేమీ లేదు. ఇనప్పెట్టెకు తాళం

వెయ్యడమన్నా మరిచిపోతాడు గానీ, భార్య శీలరక్షణను మాత్రం మరవడు. సరేలే రేపు..."

సావిత్రి అతని చేతులు పట్టుకొంది. ఏడిచింది. బ్రతిమిలాడింది.

"ఇవన్నీ నా కొద్దు. జాలిచేత నన్ను కరిగించి పోదామని చూస్తున్నావు. కానీ లాభంలేదు. ఒక్క కన్నీటి చుక్కతో తుడిచిపెట్టుకుపోయేది ప్రేమకాదు. ఏ అవాంతరానికీ, హింసకు, ధ్వంసానికీ, తలవొంచక, ధీరంగా, దృఢంగా, నిలబడగలిగిందే ప్రేమ అందుకే నీ భవిష్యత్తు ఏమయినా సరేనని యిందుకు సాహసించాను..."

"ఇదేం ప్రేమ? వెధవ ప్రేమ! నా తమ్ముణ్ణి ప్రేమిస్తున్నాను నేను. వాడికి కొంచెం దెబ్బ తగిలితే రెండురోజులు అన్నం తినలేదు నేను, వాడు తినలేదని. మరి నువ్వు నన్ను గానుగలో వేసి పిండి, నా రక్తం తాగుతా నంటున్నావు. నేను గిల గిల తన్నుకొంటూంటే చూసి ఆనందపడతానంటున్నావు. ఇది రాక్షసత్వం కాదా మరి?" అన్నది సావిత్రి.

"నీ దృష్టిలో కావొచ్చు. నాకు కాదు. నా దృష్టికి నాది దేవత్వం. ఇన్ని హింసలు నువ్వు పడుతున్నట్లు తెలిసి కూడా, నీ మీద కోరికను చంపుకోలేని నా మోహగాఢత్వాన్ని గుర్తించనినువ్వే రాక్షసిలాగా నాకుకనిపిస్తున్నావు. సత్యాసత్యాలకు సరైన కొలతబద్దలులేవు. వున్నయ్యనీ వుంటయ్యనీ అనుకోవటం తెలివి తక్కువ. ఆ వున్నవి నిజ

మైన కొలతబద్దలు కావు. నిజమైనవని మనం అనుకొంటున్నవి మాత్రమే!"

ఆమె బొమ్మలాగా నిలబడింది. ఆ స్తబ్ధతలోనే అతని పురుషత్వం అర్థంచేసుకొంది, ఆమె బలహీనతను. స్త్రీ పట్ల నిర్దాక్షిణ్యంగా, క్రూరంగా ప్రవర్తించే సంఘాన్ని ఆధారం చేసుకొని ఈ పురుషుడు ఆ స్త్రీని లోబరచుకొన్నాడు. మెల్లిగా దగ్గరికి జరిగి కావిలించుకొన్నాడు. తన సుఖంకోసం ఆమెను బెదిరించి, మాటల చాతుర్యంతో వొంచి, తనకు వుపయోగించుకొంటున్నాడు. ఆమె పలకలేదు. లక్షలసంవత్సరాల బానిస రక్తం పురుషుల అహంకారానికి, మాటకు, శరీరానికి, తిండికీ ఆశించి స్వజీవాన్నే మరచిన "స్త్రీత్వం" కంఠం నులిమివేయబడింది. చీకట్లను మెగజిమ్మే ఆరాత్రిలో, చుక్కల చూపులకిరింద, ఆమెను దగ్గరకు తీసుకొని; సావిత్రి పెద్ద పాపం చేస్తున్నట్లు కళ్ళు మూసుకొంది. ఆమె ప్రత్యవయవమూ కంచుకొని, నిశ్చేతన మవుతున్నది. ఒక భర్త తప్ప ఇంతవరకెవ్వరూ తాకని ఆ మృదుపవిత్ర దేహాలను, వందలమంది "కనులు" మృదుస్పర్శకోసం, దర్శనంకోసం, కలలుగనే ఆ స్థలాలను, అతను-లోకపు కల్మష పూరిత, పిపాసతారిని చూపి, తాకుతుంటే, అనుభవిస్తుంటే ఆమె నోరు మెదపలేకపోయింది. ఇది ఆమెతప్పా? చెప్పకుండ నోటినే బిగించివేసిన లోకంతప్పా? మరొక వ్యక్తికి లొంగక, ప్రబలంగా ఎదిరించి, నిలబడగల ఔన్నత్యమే, ధైర్యమే స్త్రీ నుండిలాగి, రాయినిచేసి, ఆ రాయి ఎదిరించలేదనటం ఏం న్యాయం? ఎదిరించాలని ఆశించటం ఎంత మూర్ఖం!

"పోతాను..." అన్నాడు చలపతి ఆమె జుట్టు రెండు చేతులతో తీసుకొని. సావిత్రి మాట్లాడలేదు. అతను రెండు భుజాలు పట్టుకొని నిలుచోబెట్టాడు. జుట్టు దువ్వి సరిచేశాడు. చొక్కాతో చెంపలు, ముఖం తుడిచాడు.

"మరిచిపోబోకు, రేపురాత్రిగూడ రా."

తప్పదు ఆమెకు—రేపురాత్రి, ఎల్లుండిరాత్రి, ఆ పై రాత్రి, ఆ పై రాత్రి. ఇట్లా అన్ని రాత్రిలూ, ఆమె బ్రతుకు బద్ధలయిందాకా రావలసిందే. ఒకస్త్రీ ఒక్కసారి ఏకారణం వల్లనయితేనేం—పురుషునికి తనశరీరంమీదసర్వహక్కులూ యిచ్చిన తరువాత, అతనినుండి ఆ హక్కులు తిరిగి తీసుకోవటము ఎక్కడా ఎప్పుడూ జరగనిపని. ఏ పరిస్థితిలోనూ ఈ అగ్ని ముట్టుకోగూడదు. దురదృష్టవశాత్తూ ముట్టుకొంటే తనంతటఅది భస్మంకావటమేతప్ప ఇంకే గొప్ప శక్తీ ఏపరిస్థితీ దాన్ని ఆర్పలేదు...

...ఇంట్లోకొచ్చింది. తనమీదతనకే అసహ్యమేసింది. ఈ 'ఎంగిలి' శరీరాన్ని ఇక ఏముఖం పెట్టుకొని భర్తకు యివ్వాలి?

...భర్త ఇంకా నిద్రపోతూనేవున్నాడు. ఎందుకో ఆమెకు ఏడుపు పొర్లుకొస్తున్నది తను చేసిన ఈ పాపకార్యం భర్త చూశాడనీ, తనను దండిస్తాడనీ, పుట్టింటికి తరుముతాడని, భావించి కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నది. మెల్లిగా అతని ప్రక్కనే పడుకుంది. కానీ మామూలుగాకాదు. అంతాకొత్త కొత్తలుగా, తనను వెక్కిరిస్తున్నట్లుగా అనిపించింది. అతని

ప్రక్కన ఉండగల ఆర్ద్రత కోల్పోయినట్లుగా బాధపడు తున్నది.

అతను లేచాడు. సావిత్రిగుండె దడదడమన్నది. తన లోంచి దోసిళ్ళకొద్దీ రక్తం ఎవరో జుర్రుతున్నట్లు జుర్రుతున్నట్లు వొణికింది.

"ఏమిటి సావిత్రీ!" అన్నాడు భర్త.

కోటానుకోట్ల భారత స్త్రీలకు ప్రతినిధియైన సావిత్రి పలకలేదు. పలికినా నిజం పలకదు. ఆ నిజాన్ని భర్త స్వీకరిస్తాడనే నమ్మకం కుదిరేవరకూ సావిత్రి మాట్లాడదు. స్త్రీ చెప్పగల నిజాన్ని విని, సహించగల ఔదార్యంలేక వాళ్ళను నిజం చెప్పకుండా అణిచి, అబద్ధాలుచెప్పేటట్లు అలవరిచి, ఆ అబద్ధాలనే నిజాల క్రింద స్వీకరించి, దొంగ సంతృప్తులు పడే పురుషుల అహంకారం సమూలంగా ధ్వంసమయిందాకా సావిత్రి పలకదు. ఎన్ని యుగాల తర్వాతనైనా ఆ మహత్తర ఘడియ ఉదయించకపోదు. ఆనాడు సావిత్రి లేస్తుంది. భర్తకు నిజం చెబుతుంది! అంతవరకూ అట్లా పరుపుమీద బోర్లపడుకొని, దిండులో మొహం దాచుకొని సావిత్రి ఏడుస్తూనే ఉంటుంది. భర్తమాత్రం "ఏమిటి సావిత్రీ!" అంటూనే వుంటాడు.

# తారతమ్యం

మీనాక్షి బోగంది. ఇరవై సంవత్సరాల ఈడుకే కావలసినంత డబ్బు సంపాదించింది. తల్లికాలంలోని పెంకుటిల్లు పడగొట్టి రెండంతస్తుల మేడ వేయించింది. కొద్దిరోజుల్లోనే ఒక చిన్న కారు కొనే ప్రయత్నంలో ఉంది.

ఈ సమయంలోనే మీనాక్షికి తన వృత్తిమీద అసహ్యం కలిగింది. ఈవిధంగా ఎంతకాలం జీవితాన్ని గడిపేట్టు? డబ్బుకోసం ఎంత నటన చూపించాలి? రోజు రోజుకూ మొగాళ్ళు మారుతూనే ఉంటారు. వొక్కొ-రాత్రి ఆరుగురు మొగాళ్లు మారిన సమయాలుగూడా లేకపోలేదు.

మీనాక్షికి ఇప్పుడు సంసారస్త్రీల పైకి మనసు మళ్ళింది. వాళ్ళలాగా చక్క-గా (?) సంసారంచేస్తూ బిడ్డా పాపలతో కళకళ్ళాడాలని మీనాక్షి కోరిక. తను ఎంత 'ప్రేమ' చూపినా అదంతా 'బోగంతళుకు' కిందనే జమ కట్టబడుతోంది. తన జీవితానికి గమ్యస్థాన మేమిటి? ఎంత దూరం తనీవిధంగా ప్రయాణించాలి? చివరికి మిగిలేదేమిటి?

మీనాక్షికి కొంత ఆలోచించిన తరవాత తనకోరిక అసంభవమైందిగా కనిపించింది. మీనాక్షి బోగంది. పధ్నాలుగోపటనే వృత్తిలోకి దిగింది. ఈ ఆరుసంవత్సరాల కాలంలోనూ కొన్నివందలమంది మీనాక్షిని అనుభవించారు. ఆసంగతి ఎంతోమందికి తెలుసు ఇప్పుడీ మీనాక్షికి నిజంగా హృదయపరివర్తనం కలిగి 'పెళ్ళి' చేసుకోవడానికి

తయారయిందే అనుకోండి; అయితే మీనాక్షిని చేసుకోవ డానికి వొచ్చేవాడెవడు? అంతసంస్కారం కలిగినవాడు దొర కడం చాలాకష్టం. కాకపోతే "వుంచు" కొంటారు. "పెళ్ళి" అనే పేరుమీద గాకుండా 'చేరదీస్తారు'.

మీనాక్షికి ఇవినచ్చవు. వుంచుకొనేవాళ్లు (పర్మ నెంటుగా) చాలామంది వున్నారు చేరదీసేవాళ్లు కూడా చాలామందే వున్నారుకానీ, మీనాక్షికి కావలసింది భర్త రోజురోజుకూ ఈ సమస్యతో మీనాక్షి కొట్టాడుతూంవుంది

## 2

అయితే మీనాక్షి కోరిక అసంభవమైంది కాలేదు. నాగేంద్రం మీనాక్షిని పెళ్ళిచేసుకోడానికి అంగీకరించాడు.

నాగేంద్రానికి పాతికసంవత్సరాల వయస్సుంటుంది. తల్లిచిన్నప్పుడే చచ్చింది. తండ్రి నాగేంద్రం ఇంటర్ చదువుతున్నప్పుడు చచ్చాడు. ఆస్తిపాస్తులేమీ లేవు. ఏదో దేశవాళీ కంపెనీలో నెలకు యాభయ్ రూపాయలు తెచ్చు కొంటున్నాడు. నెలకు బొటాబొటీగా సరిపోతుంది. నాగేం ద్రంభార్య నీళ్ళాడలేక చచ్చిపోయి నాలుగు సంవత్సరా లైంది. ఇంతకాలం అతను పరాయి ఆడవాళ్ళను వాడు కొన్నాడు అయిదునెలలు ఒక బ్రాహ్మణవిధవను 'వంట' కోసం అట్టేపెట్టుకొన్నాడు. ఈలోపల శ్రీమతిగారికి గర్భం వొచ్చింది. ఆవిడ "జీతంచాలక" నాగేంద్రంనుండి వెళ్ళి

పోయింది. మొత్తంమీద నాగేంద్రం ఇతరత్రా చాలా ఖర్చుపెడుతుంటాడు.

మీనాక్షి అతన్ని పెళ్ళిచేసుకోడానికి మనస్ఫూర్తిగా అంగీకరించింది. అప్పుడే ఆవిడదృష్టిలో పతివ్రతలు మెరవ సాగారు. ముఖ్యంగా చింతామణి వగైరాలు. మీనాక్షి ఈకోరిక తల్లికి సుతరాము నచ్చలేదు ఆ కసినంతా నాగేంద్రంమీదికి సమీకరించింది. "నిన్ను పోలీసులకు పట్టిస్తా" నంది. "ఇంతకంటే మరేం గతిలేదూ?" అంది. కూతురుతో పూచికపుల్లగూడా అంటుకోనివ్వనని నిష్కర్షగాచెప్పింది.

ఈ బెదరింపులకు ఏ ఒక్కరూ జంకలేదు. కట్టుగుడ్డలతో పదిరూపాయలతో (ఇవి మాత్రం రాత్రి జట్కా ప్రియుడు ఇచ్చాడు) నాగేంద్రం వెంట బయలుదేరింది.

ఆనాటిరాత్రి హోటల్‌నించి కారేజి తెప్పించాడు నాగేంద్రం. మీనాక్షి ముందు నాగేంద్రానికి వొడ్డించింది.

"నీవూ కూచో మీనూ" అన్నాడు నాగేంద్రం.

ఆ స్వరంలో నిండారిన ప్రేమధ్వనులు వినిపించినయ్ మీనాక్షికి. మీనాక్షిగుండెలు గగుర్పొడిచినయ్. వొళ్ళు జలదరించింది.

"మీరు కానివ్వండి......తరవాత కూచుంటాను" అంది. అని తను పతిభక్తిని బాగా అలవాటు చేసుకొంటు న్నాననుకొంది. ఇదివరకు చాలామంది విటులు నాగేంద్రం లాగే అన్నారు. కానీ వాళ్ళమాటలకు నాగేంద్రం మాటలకు కొంతభేదాన్ని అస్పష్టంగా చూడగలిగింది మీనాక్షి. నాగేంద్రం భోంచేసి వొక్కపలుకు నముల్తూ కుర్చీలో

కూచున్నాడు. మీనాక్షికి రెండవఆకులో భోంచేయ బుద్ధి పుట్టలేదు. నాగేంద్రం కెలికికెలికిపోయిన ఎంగిలాకులోనే తనూ తింది రోజూ తనుతినే అన్నానికీ దీనికీ చాలా భేదమున్నట్లుగా మీనాక్షికి తోచింది.

రెండో ఆట సినిమాకు పోయివొచ్చేసరికి బాగా పొద్దు బోయింది. అందులో నాగేంద్రం పగలల్లా ఆఫీసులో (ఆఫీసులోనని అతనే చెబుతుంటాడు. కాదనుకొన్నా ఈ రచయితకు ఆట్టే ఇబ్బందిలేదు. కాని నెలకు 50రూపాయలు మాత్రం తెస్తుంటాడు. అంతవరకు గ్యారంటీ) పనిచేయడం వల్ల అలిసిపొయ్యాడు. మీనాక్షి చప్పున గ్రహించింది. తెల్లారగట్లదాకా అతనికాళ్లు పిసికింది.

## 3

నాగేంద్రం ఇంతవరకూ వున్నది వొక కొద్దిపాటి గదిలో. అందులో రెండే మంచాలు. ఒక బీరువా, కొద్దిపాటి సామానుఉంది. ఇదివరకు నాగేంద్రం నెలవారీగా హోటల్లో భోంచేస్తుండేవాడు. మీనాక్షి వొచ్చినప్పటినుండీ హోటలు కెళ్ళడం మానుకొన్నాడు. అయితే ఇద్దరికీ సరిపడేలాగా క్యారియరు వస్తుంటుంది. ఒకనాటి రాత్రి నాగేంద్రం తీరిగ్గా పడుకొని (ఆసమయంలో మీనాక్షి ఇంకోమంచం మీాద నిద్రపోతూవుంది) తను నెలవొకటికి హోటలుకి ఎంత చెల్లిస్తున్నదీ లెక్కగట్టాడు. సొంతంగా వంటబెట్టేపక్షంలో హోటలుకు చెల్లించే డబ్బులో ఐదింట మూడువంతులకే ంతకంటే మంచిభోజనం దొరుకుతుందని అంచనావేశాడు.

అయితే వంటకు ఈ యిల్లు చాలదు. కాబట్టి వేరేయిల్లు తీసుకోవాలి. ఆ లెక్క ప్రకారం చూసినా వంటపెట్టడమే మంచిదిగా కనిపించింది నాగేంద్రానికి.

ఆ తెల్లవారే మీనాక్షితో ఈ సంగతి చెప్పాడు.

"నాకు వండడం చాతగాదండీ" అంది మీనాక్షి. నిజంగా మీనాక్షికి వండడం చాతగాదు. చిన్నతనంలో తల్లి వండేది. మొన్నటిదాకా పనిమనిషి వండేది. కాబట్టి వంటవిషయం తెలుసుకోవలసిన అవసరం మీనాక్షికి ఇంత క్రితం కలగలేదు. కానీ ఇదివరకుదారి వేరు, ఇప్పటిదారి వేరు. అందులో వారికి హోటలుకూడు సరిపడకనే ఈమాట అన్నారేమో! ఈ సందేహం మీనాక్షిమీద బాగా పని జేసింది. వొండడానికి అంగీకరించింది. వొకటిరెండు రోజుల్లో అంతే అద్దెలో యింకో యిల్లు మాట్లాడాడు నాగేంద్రం. మీనాక్షి ఆ యిల్లు చూచి సంతోషించింది.

ఒకనాడు మీనాక్షి నాగేంద్రాన్ని కొద్దిగా చిల్లర డబ్బు లడిగింది. "ఎందుకూ?", అన్నాడు నాగేంద్రం.

"సబ్బు కొనుక్కోవాలి... అయిపోయి రెండు రోజు లయింది" అంది మీనాక్షి. మీనాక్షి అతన్ని డబ్బులడగటం అదే తొలిసారి.

"సబ్బులేకపోతే స్నానంచేయకూడదావేం?" అన్నాడు నాగేంద్రం. "మనం లక్షాధికారులంగాము. కనీసం గొప్ప ఉద్యోగమన్నా లేదు. యాభయ్ రూపాయలు ఎన్నింటికని వొస్తయ్?" అన్నాడు. అప్పటినుండి మీనాక్షి సబ్బుతో స్నానంచేసిన పాపాన పోలేదు.

# 4

తొలిరోజుల్లో నాగేంద్రం కొన్న నాలుగు చీరెలు చినిగిపోయినయ్. అప్పటికీ మీనాక్షి ఈసంవత్సరమల్లా వాటిని పొందికగా వాడింది. సాధ్యమయినంతవరకూ వాటిని సూదీదారంతో సంస్కరించింది. అయినా అలవిగానిస్థితిలోకి దిగజారినయ్ ఆ చీరెలు. అసలు చిరుగుముఖం పట్టినప్పుడే కొత్తచీరెలను గురించి ఒకటి రెండు సార్లు నాగేంద్రాన్ని హెచ్చరించింది. అతగాడు ఈ నెలనీ... ఆ పైనెలనీ జరుపుతూ వొచ్చాడు. ఇక కొత్తచీరెలు కొనందే లాభంవుండ దని తేలిపోయినరోజున ఆమె నాగేంద్రానికి ఈ విష యమై గట్టిగా చెప్పింది.

"యాభయ్ రూపాయల్లో ఎన్నని సర్దగలను? ఇంకా నయం, ఏ పాతన్నా నీకు సొంతంగా వున్నయ్. ఇప్పుడు నేను వేసుకొంటున్న గుడ్డలు వొకానొక స్నేహితుడు ధర్మం చేశాడు... వొచ్చే నెలలో చూద్దాం లే" అన్నాడు నాగేంద్రం.

న్యాయంగా అయితే ఆ గుడ్డలు మరో వారంరోజు లయినా శరీరాన్ని కాపాడే స్థితిలో లేవు. ఆ సంగతి నాగేంద్రానికి తెలుసు. కానీ ఏం చేస్తాడూ పాపం! యాభయ్ రూపాయల గుమాస్తా పురుగాయె!!

చీరలనుగురించి యిబ్బందిపడడం మీనాక్షిజీవితంలో యిదే మొదలు. మీనాక్షికి చిన్నతనంలోనే పాతిక జత లుండేవి. మీనాక్షికి కన్నెరికం పెట్టిన చౌదరయ్యే పాతిక చీరెలు తెచ్చాడు—నూలువి, సిల్కువి కలిపి. ఆ తరువాత మీనాక్షి సంపాదించినవి మూడు బీరువాలనిండావున్నయ్.

ఏ విషమసమయంలో గూడా యిస్త్రీబట్టను రెండురోజుల కంటే మీనాక్షి ఎక్కువకాలం కట్టలేదు. అయితే మీనాక్షి యిస్త్రీ బట్టలు కట్టడం మానుకొని ఆరునెలలు కావొచ్చింది ఇప్పటికి. బస్తీలో చాకలివాళ్ళు దొంగవెధవలని నాగేంద్రం చెప్పడంచేత మీనాక్షి తన గుడ్డలను—నాగేంద్రంవాటితో సహా స్వయంగా వుతికేది వాళ్ళని నమ్మలేక.

ఈ సంగతులన్నీ మీనాక్షికి తెలియకపోలేదు. అయినా అది 'కులట' జీవితం; ఇది 'సంసారి' జీవితం. ఎన్నో ఢక్కామొక్కీలు తింటేగాని ఈ రెండవదాంట్లో నిభాయించడం కష్టం. చెడును సంపాదించుకోడానికి కొన్ని నిమిషాలు చాలు. కానీ ఆ చెడును నిర్మూలించి ఆ స్థానంలో మంచిని వుంచాలంటే ఎన్నో సంవత్సరాలు కావాలి. ఈ లోపుగా ఆ వ్యక్తి ఎన్నో అగ్నిపరీక్షలకు తట్టుకోవలసి వుంటుంది. అప్పటికిగాని సత్ఫలితం కలగదు. ఈ విషయాలన్నీ మీనాక్షికి తెలిసింతరువాత చీరలనుగురించి ఆమె అంత గట్టిగా ఎప్పుడూ అడగలేదు.

## 5

ఇప్పుడు మీనాక్షి కడుపుతోవుంది. ఇంటిపని చేయలేక నానాఅవస్త పడుతోంది.

"ఈ నెలరోజులు ఒక పనిమనిషిని కుదర్చండి. నేను చేయలేకుంటున్నాను" అంది మీనాక్షి.

"ఎన్నింటికని చావను? అందులో ఈనెలనుండీ ఇంటి అద్దె అయిదురూపాయ లెక్కువయింది. నీకంటే ముందే నా

కీ ఫూహా తట్టింది. ఈనెల మొదటే ఒక పనిమనిషిని మాట్లా డాను. అద్దె పెరగడంచేత దాన్ని మానుకోమని చెప్పాలి వొచ్చింది. యాభై రూపాయల్లో ఎన్నని సర్దను?" అన్నాడు నాగేంద్రం.

మీనాక్షి కిప్పుడు ఆరోనెల. అయినా ఇంటిచాకి రంతా చేస్తూనేవుంది. దానికితోడు ఏదో నలత వొంట్లో ప్రవేశించింది. అయినప్పటికీ వాళ్ళింట్లోవున్న రెండుమంచా ల్లోనూ ఒకదానికి బూజుపట్టింది. దాన్ని ఈ సంవత్సరంన్నర కాలంలోనూ ఏ పది దఫాలోకంటే ఎక్కువ వాడలేదు.

ఒకనాటిరాత్రి మీనాక్షి అర్ధజాముదాకా మూలిగి అప్పుడే కునుకుదీసింది. అంతవరకూ నిద్రబట్టక తన్నుకొం టున్న నాగేంద్రం అప్పుడే కునుకుపట్టిన మీనాక్షిని తనవేపు తిప్పుకొన్నాడు. గట్టిగా తనకు ఆనించుకుని నొక్కుకొన్నాడు. మీనాక్షికి మెలకువ వొచ్చింది. అభ్యంతరం చెప్పింది. 'వొంట్లో సరిగాలేదు' అన్నది. కడుపువేపుచూపి బతిమా లింది. వోపికనంతా కూడగట్టి ఎదురుతిరిగింది. నాగేంద్రం యినపగరిటెతో గొడ్డును బాదినట్లు బాదాడు. మీనాక్షి శోకాలుబెట్టింది. చుట్టూ ఇళ్ళల్లోవున్న ఆడంగులు మీనా క్షిని ఓదార్చటానికి రాలేదు. పైగా 'ఏం, మాయరోగ మొచ్చిందా... కి... బోగందీ... బోగంవగలు!' అని తమ మొగుళ్ళను గట్టిగా కావిలించుకొని నిశ్చింతగా నిద్ర పొయ్యారు. ఏది ఏమయినప్పటికీ ఆరాత్రి తన అవసరాన్ని మాత్రం తీర్చుకోగలిగాడు నాగేంద్రం. అప్పటికి మీనాక్షికి ఎనిమిదోమాసం నిండింది.

మీనాక్షి దెబ్బలు తినడం ఇది నాలుగోసారి. కారణాలుమాత్రం ఇవే. ఒకసారి కొంచెం తలనొప్పిగా వుంది. అదీ అవ్వేళ మధ్యాన్నం నిద్రపోకపోవడం మూలాన. ఆరాత్రి వొక ఆసామీవొచ్చి రాత్రికి పాతికరూపాయలిస్తానన్నాడు. తల్లి ఎంతో బతిమాలింది. ఆమె ఒప్పుకోలేదు. డాక్టరుచేత ఇంజెక్షను తీసుకొంది తలనొప్పికి. ఇది మీనాక్షి 'కులట'జీవితంలో సంగతి. 'సంసారి' జీవితంలోకొచ్చిన తరవాత ఎనిమిదినెలలగర్భంతో మొగుడికి లొంగిపోలేదని చావతన్నించుకొంది.

# 6

మీనాక్షి నీళ్లాడింది. అప్పటినుండీ ఆమె మంచంలోనించి లేవదు. పిల్లాడికి తల్లిపాలు చాలడంలేదు. అందులో "రోగిగావున్న తల్లిపాలుపట్టడం మహాప్రమాదం" అన్నారు కొంతమంది. పిల్లాడు పూర్తిగా డబ్బాపాలమీద ఆధారపడవలసివొచ్చింది.

"ఎక్కడిడబ్బా వీడిబొందకే చాలడంలేదు. ఎన్ని పాలడబ్బాలని తేను? యాభయ్‌రూపాయల్లో ఎన్నని సర్దను?" అన్నాడు నాగేంద్రం.

పాలులేక చిక్కిపోతున్న తనకొడుకునిచూచి బావురుమని ఏడ్చింది మీనాక్షి. "ఈ నిర్భాగ్యురాలి కడుపున ఎందుకు పుట్టావురా నాయనా!" అని నాగేంద్రం చూడకుండా శోకాలుబెట్టింది.

మీనాక్షి పూర్తిగా కోలుకోనేటప్పటికి ఆరుమాసాలైంది. అయితే మీనాక్షికిబదులు పసిపిల్లడు జబ్బుపడ్డాడు. డబ్బాపాలు చాలడంలేదు. అవయినా పిల్లాడు ఇముడ్చుకోలేకపోతున్నాడు. కళ్ళు గోతుల్లాగ తయారయిన్నై. చేతులు కాళ్ళు పూచికపుల్లలకంటె హీనం. కడుపుగుమ్మడికాయంత.

"ఇది లివరుజబ్బమ్మా! జమ్మివారిమందు వాడండి, తగ్గిపోతుంది. మొన్న వెంకమ్మత్తగారి తురుకు..." అన్నారొకరు.

ఆనాటి రాత్రి నాగేంద్రంతో సంగతి చెప్పింది, మీనాక్షి. "నిజమే పాపం! ఏంచెయ్యమంటావు?" అన్నాడు నాగేంద్రం. మీనాక్షి ఏమీ చెప్పలేదు. గురకబెడుతున్న కొడుకును గుండెకదుముకొని తడికళ్ళుమూసింది.

అర్ధరాత్రప్పుడు పిల్లాడికిబదులు నాగేంద్రం తగిలాడు.

"నేనేలే, ఏదీ ఇట్లాతిరుగు" అన్నాడు నాగేంద్రం మీనాక్షి పొత్తికడుపుకింద తవుడుతూ.

"పిల్లాడు" అంది మీనాక్షి లేవబోతూ. నాగేంద్రం మీనాక్షిని లేవకుండా అదిమిపట్టి "రేప్పొద్దున డాక్టర్ని పిలుస్తాను... ఇందాక అబ్బాయినిచూస్తే నాగుండె తరుక్కు-పోయింది" అన్నాడు. మీనాక్షిలోని "మాతృహృదయం" కరిగిపోయింది. తన చిట్టిబాబు ఆరోగ్యంకోసం తనవొంట్లో 'సరి' లేకపోయినా తెల్లవార్లూ నాగేంద్రంచేతుల్లో వొంపులు తిప్పబడింది.

నాగేంద్రం సత్యహరిశ్చంద్రుడు కాడు. కనీసం కృత యుగంలోని మనిషన్నా కాడు (ఆ యుగంలోనివాళ్లు మంచి వారని ఈ రచయిత ఎప్పుడూ అభిప్రాయపడలేదు. అది

రచయిత తప్పుకాదు) అన్నమాట చెల్లించడానికి. అతను సర్వసాధారణమైన మనిషి. మీదుమిక్కిలి పందొమ్మిదో శతాబ్దంవాడు.(ఇది ఇరవయ్యోశతాబ్దమని అనడంఅనుచితం అనే 'శ్రీశ్రీ'తో ఈ రచయిత ఏకీభవిస్తున్నాడు) అంచేత ఆ తెల్లవారి డాక్టర్ని పిలవవలసినఅవసరం నాగేంద్రానికి లేదు.

# 7

పిల్లాడు చచ్చి నెలరోజులు దాటింది. ఈ దిగులువల్ల కుమిలిపోయిన మీనాక్షికి రోగం తిరగబెట్టింది. అంతరోగం తోనూ ఇంటిచాకిరీ చేస్తూనేవుంది. నాగేంద్రం మహా భయస్తుడు. అంచేత రాత్రిళ్ళు ఒంటరిగాపడుకోలేడు. రోగంతో మూలుగుతున్నాసరే మీనాక్షిని తోడుజేసుకొని పడుకొంటాడు. అప్పటికిగానీ నాగేంద్రం నిర్భయంగా నిద్రపోలేడు.

ఒకనాటిరాత్రి మీనాక్షి ఎందుకో లేచింది. దీపం సన్నగా వెలుగుతూవుంది. నాగేంద్రం పక్కలోలేడు. బైటికెళ్ళాడేమో ననుకొంది అరగంటకయినా రాకపోవడంచేత బైటచూద్దామని తలుపుతీయబోయింది. చాలాసేపటికి గానీ బైట గొళ్ళెం పెట్టబడిందని మీనాక్షి తెలుసుకోలేకపోయింది.

ఆ తెల్లవారి నాగేంద్రాన్ని అడిగింది.

“ఆఁ, నీమొఖం ........ ....కలవరించావేమోలే!” అన్నాడు నాగేంద్రం.

అట్లాంటి కలవరింపులు మీనాక్షి చాలాసార్లు కలవరించింది. ఒక వారంరోజులు పట్టుబట్టిచూసింది. అన్ని

రోజులూ మీనాక్షి ఆవిధంగా కలవరిస్తూనేవుంది. పోతే నాగేంద్రం ఒక అమ్మాయిని 'లవ్' చేశాడని, తనకు రాత్రిళ్ళు పక్కలో నాగేంద్రం లేనట్లు "కలవరింపు"లు రావడానికి ఆ "లవ్వే" కారణమని మీనాక్షికి చాలాకాలం దాకా తెలియలేదు.

పాపం ఎక్కువకాలం దాగదు. మీనాక్షికి ఆవిధమైన కలవరింపులు రావడం ప్రారంభించిన రెండుమాసాలకు నాగేంద్రం వొంటినిండా చారెడేసి పొడలు పుట్టినయ్. పదిరోజులు తిరక్కముందే మీనాక్షివొంటిమీదికి ఈ పొడలు పాకడం జరిగింది. నాగేంద్రం "లవ్"చేసిన అమ్మాయి దండిగా రూపాయలు ఖర్చుపెట్టి తన "లవర్" శరీరాన్ని మరామ్మత్తు చేసుకొంది. మీనాక్షి అవసరం నాగేంద్రానికే పట్టినప్పుడు, నాగేంద్రం"లవర్" కేం అవసరం?

మీనాక్షిపని యిప్పుడు నానా గిజాటుగావుంది. తన శరీరాన్ని నాగేంద్రానికి చూపించి డాక్టర్ని పిలవమని బతిమిలాడింది. అప్పుడు నాగేంద్రం తాగి వున్నాడు. ఆ సంగతి మీనాక్షికి అప్పుడే తెలిసింది.

"...ఇంకా దొంగవగలుపోతావేం? నానా గాడిదలతో తిరిగి అడ్డమైన రోగాలన్నీ వొంటికి పట్టించుకొన్నావ్. అవన్నీ నాకు ఎక్కించి నా ఆరోగ్యం నాశనం చేశావ్. నువ్వసలు భోగం...వి. నా యింట్లోనించి ఫో..." ఈ వరసలో వెళ్ళాడు నాగేంద్రం ఆఖరికి మీనాక్షిని స్పృహ తప్పేటట్లు తన్ని బైటికీడ్చాడు.

చుట్టుపక్కల జనం "భోగం...! భోగంవగలూ" అన్నారు.

మీనాక్షి వొక్కసారి తన పాతజీవితంలోకి తొంగి చూసింది. అదెంత హాయయిన జీవితం! ఎంత డబ్బిచ్చినా నచ్చనివాడైతే తిరస్కరించే ప్రాథమికహక్కు ఆ జీవితంలో దొరుకుతుంది. సర్వసంపూర్ణమైన బతుకు తన కావిలింతకోసం వందలమంది తిరుగుతుంటారు. ఎంతో ఆకర్షణ, వెలుగు, మధురంగా పొంగుతూవుంటుంది. క్షుద్రమైన సంసార జీవితం! మొగుడు నచ్చినా నచ్చకపోయినా నచ్చినట్టు నటించాలి. తన ఆరోగ్యం ధ్వంసమయివున్నా మొగుడి చేతుల్లో వొంపులు తిరగాలి. తిండికోసం, గుడ్డకోసం, చివరికి జడ రిబ్బనుకోసం మొగుడికి శరీరాన్ని వొప్పజెప్పిందాకా గతిలేదు. అయితే భోగంవాళ్ళకీ సంసారులకీ ఎక్కడాభేదం? భోగంది వందరూపాయలకు నచ్చినవాడికి శరీరాన్నివొప్పగిస్తుంది. సంసారస్త్రీ రిబ్బనుకోసం కుళ్లుమొఖంభర్తను కళ్ళు మూసుకొని ఏడుస్తూ భరిస్తుంది. తన కిష్టంలేకపోతే ఆ లోకంలో తిరస్కరించనొచ్చు "మన సభ్యత" "మన సంస్కృతి" అని బొదబొదలాడే జబ్బలు చరుచుకొనే ఈ లోకంలో ఆడదాని ఇష్టా ఇష్టాలతో నిమిత్తంలేదు. వేడి తగ్గితే సరి.

మీనాక్షి తన మొదటిజీవితంలోకి వెళ్ళాలనుకొంది. "ఉత్తమమైన సంసార రంగం" (? ? ?) మీనాక్షిజీవితాన్ని ధ్వసంచేసింది. ఉన్న సౌందర్యమంతా నాగేంద్రం పీల్చి

కొన్నాడు. పిప్పిని బైటికి గెంటాడు. ఆకర్షణ, కాంతి లేని బతుకు మీనాక్షిది ప్రస్తుతం. ఇక తన ముఖ మెవరు చూస్తారు? తన గతేమిటి?

"భగవంతుడా!" అంది మీనాక్షి చేతులు జోడించి.

భూలోకవ్యవహారాలతో పూర్తిగా తెగ తెంపులు చేసుకొన్న భగవంతుడు "నాకెందుకు" అని చప్పగా నిద్ర పోయాడు.



# ప్రాస

ఇంకా బైట తిరగడం ప్రమాద మనిపించింది. ప్రమాదమయినా కాకపోయినా బొత్తిగా అనవసరమేనని అనుకోవచ్చు. ఈసరికి ఆ దౌర్భాగ్యుడు తన దుఃఖాన్నుండి కొంతవరకైనా దూరం జరిగిఉంటాడు. సంఘటన జరిగి నప్పటి బరువైన విచారం, కాలం తేలికచేసి వుండొచ్చు. అదృష్టవంతుణ్ణి అతను సిగరెట్లకోసం ఆ కొట్టుదగ్గిర పర్సు తీసి... మళ్ళీ జేబులో పెట్టుకోబొయ్యే అదనులో—ఫినిష్. ఆరువందల ముప్ఫైనాలుగు రూపాయల, పదకొండణాల కాని—రైల్వేవారిని మోసంచేసి దాచిన కాలందాటిన టిక్కెట్టు—చిన్ని ఫొటో, ఏవో అంకెలుగిలికిన కాగితం—దగ్గుమందు పొట్లం. చుట్టూ జనం పోగయినారు. అందరూ జాలిని సరఫరాచేశారు. సానుభూతి దిగుమతిచేశారు. దీనికి కేంద్రప్రభుత్వం యింకా పన్ను విధించ లేదు.

ఎవరు దొంగ? అందరూ—అందరమూ దొంగను వెదికాము. దూషించాము. ముద్దుపళని సిగ్గుపడే భాషను వాడాము.

చివరికి... కొంతకాలానికి—దొంగ దొరికాడు. చిరి గిన లాగు, రేగిన జుత్తు. మురికివొళ్లు—ప్రతిక్షణమూ అంద రినీ తినే కళ్ళు. వాడే దొంగ! ఇదివరకు—ఒకటి రెండు సార్లు—కలవారి జేబులు కత్తిరించినమనిషి. వాడిమీాద దెబ్బలు... ...దరిద్రుడు గావును, దొంగ అయినాడు. నా

గాంగతనం ఫలితం అతను అనుభవించాడు. చుట్టూ ముసిరిన నా సోదరులు అతన్ని జుట్టుబట్టుకొని వొంచడంవరకే నేనున్నాను. ఆ మరునిమిషం పారిపోయొచ్చేశాను. అక్కడ ఉండలేకపోయాను. వాళ్ళు నన్ను కనిపెడతారనికాదు— సాంఘికంగా నాకున్న విలువ, నా దుస్తులు, నాగరికత, సంభాషణా నైపుణ్యం నన్ను సైన్యంలాగా కాపాడాయి. మంత్రించిన గిరులులాగా అడ్డుకొన్నాయి.

ఇప్పటికీ నా గుండెలు దడ దడ లాడుతున్నాయి. జిమ్మున కుంచుకుపోతున్నాయి. తిరుగుడులో నొక్కుకుపోతున్నట్లుగానే ఉన్నాయి. ఎవరో మెదడులో మేకులు దించినట్లు బాధపడుతున్నాను. తరువాత ఆ దొంగకోసం వెతికాను. మళ్ళీ కనిపించలేదు. అతనితో నిజంచెబుదామని కానే కాదు. అతనికి కొంతకారుణ్యం పంచిపెడదామనిమాత్రమే. భాషా భాండారంనుండి రెండుమూడు సుతిమెత్తనిపదాలు అతని చెవుల్లో వొడ్డిద్దామనిమాత్రమే! దొరకలేదు. బహుశా అతని ఖర్చును ప్రభుత్వమే భరిస్తున్నదేమో ఈ పాటికి!

సోదరా! భారతదేశం 'భూతదయ'కు ప్రసిద్ధివహించింది. మహత్తరమైన మన సాంప్రదాయాన్ని నిలబెట్టావు. భారత యశోలలామకు ఖండ ఖండాంతరంబులగల కీర్తిసౌధంబునకు నీ వొక వెలలేని మండపంబయితివి. నీ కీర్తి ఆచంద్రతారార్కమీ వసుధాతలంబున నిలుచుగాక. సర్వరక్షకుడైన భగవానుడు నీకు ఆయురారోగ్యైశ్వర్యాదుల ననుగ్రహించుగాక. మఱుజన్మంబున నింతకంటె నుత్కృష్ట గర్భంబున జన్మింతువుగాక. నీ కివే నా శతసహస్ర వంద

నములు. షరా: ఈ ఐశ్వర్యాలుగూడా, వొచ్చే జన్మలోనే పొందేటట్లు తరవాత సవరించటం జరిగింది.

ఇంటి మెట్లెక్కుతున్నాను. హఠాత్తుగా నాముందు మనిషి ప్రత్యక్షమయ్యాడు. భయంతో రెం డడుగులు వెనక్కువేశాను. అతనూ న న్ననుసరించాడు. ఎవ రీతడు? ఎవ రీతడు? ? కళ్ళు మూసుకొన్నాను. గుండె బిగబట్టాను. ఒక్క ఊపుతో ఇంట్లోకొచ్చిపడ్డాను. నా హడావుడి చూచి నా భార్య అదిరిపడ్డది. నాకోస మెవరన్నా వొచ్చారేమోనని వాకబుచేశాను ఎవరూ రాలేదుట. "ఎవరన్నావొస్తారన్నారా ఏమిటి?" అని అడిగింది పైగా. ఫర్వాలేదు. నా రహస్యం తెలిసిందేమోనని, పోలీసులు నాకొరకు వేట ప్రారంభించారేమోననీ, ఆ వ్యక్తి తత్సంబంధీకుడేమోననీ భయపడ్డాను. కాదు. బ్రతికాను.

ఆ తరవాత రెండురోజులకు అతను మళ్ళీ నాకు కనిపించాడు. నేను సినిమా కెడుతున్నాను. నాకంటే ముందే అతనూ నడుస్తున్నాడు. ఛరాలున వెనుదిరిగి—బిరబిర నడక ... రోడ్డు, జనం, బళ్ళు, రిక్షా, కేక. మరొక పావునిమిషంలో—ఆ రిక్షాలో కూచోగలను. గుడ్డ ముందుకులాగి ముఖానికి అడ్డుచేసుకొంటే——అతను కనుక్కోలేడు. ఎవరో మహామ్మదీయ స్త్రీ అనుకొంటాడు. పావుగంటలో యింటికెళ్ళగలను. నా కీ సినిమా చూడాలనే పిచ్చి ఎందుకు కలిగింది? ఎందుకొచ్చాను?

నా ప్రయత్న మేమీ సాగలేదు. నేను రిక్షాలోకి వొంగుతున్నాను. అతను రిక్షాలో కనిపించాడు. నాగుండె ... ఊహిం

చుకో. నేను ఎవరినుండి తప్పుకోవా లనుకుంటున్నానో, అతనే నాకెదురుపడ్డాడు. ఆ పులిచేతిలోనే నేను చిక్కు పడ్డాను. ధైర్యంగా వెనక్కి తిరిగాను. ఇంకా నయం, తిరగ్గలిగాను. ఎదురుగా బ్లూలైటు అతి నీలలోహితకాంతిని చిమ్ముతున్నది. అటు వెళ్ళడం క్షేమమనిపించలేదు. ఆ వెలుగులో నన్నతను ఇట్టే గుర్తించగలడు— ఇంతకాలమూ అనుమానిస్తున్నవాడు. ఇట్టే స్థిరంచేసుకొని... చీకటి గొందులగుండా యింటిలో ప్రవేశించాను.

అతను ఎవరై ఉంటాడా అనేదే నా ప్రశ్న. అతను పురుషుడేనని నేను గ్యారంటీ చేయగలను. నాలాగానే చొక్కా వేసుకొన్నాడు. నాలాగానే క్రాఫు. అతని కాళ్ళకీ చెప్పులు లేవు. తమాషా ఏమిటంటే, నేను ఏరోజున ఎట్లా మేకప్ ఐతే, అతనూ, అదేరోజున అట్లాగే తయారయ్యేవాడు. ఈ విషయం నేనొకసారి "జా" దగ్గిర రుజువుపరచుకొన్నాను. నేను "జా" కోసం వెళ్ళాను. "జా" నవ్వుతూ ఎదురొచ్చారు. క్రితం మధ్యాన్నం "జా" అడిగినదాన్ని తెచ్చాను. ఆవస్తువు "జా"కిస్తే నారు ఎంతసంతోషిస్తారో నే నూహించలేదు. "జా"గారి సంతసం కోసరం అపాయాలు తినేవాళ్ళల్లో నేనూ వొకణ్ణి... కానీ— నాకంటేముందే 'అతను' ప్రత్యక్షమయ్యాడు. నేనింకా "జా"ను సమీపించనేలేదు. అతను "జా" దగ్గరగా నిలబడ్డాడు. నాప్రాణం మండిపోయింది. ఆ వస్తువును నేలకు విసిరాను. అతనూ విసిరాడు. దీన్నిబట్టి చూస్తే అతను అక్షరాలా నన్ను అనుకరిస్తున్నాడని స్పష్టమైంది.

అత నెవరు? నాతో అతనికి పనేమిటి? ఈవిధంగా న న్ననుసరించి అతను పొందగల లాభ మెటువంటిది?... ఇత్యాది ప్రశ్న లనేకం నాకు స్ఫురించాయి. వీటికి సమాధానం చెప్పుకోలేకపోతున్నాను. ఏది ఏమయినప్పటికీ అతనినుండి నేనుపడవలసిన జాగ్రత్త పెద్దమొత్తంలోనే ఉన్నది. అతన్ని ఎట్లాగ్గైనా నానుండి దూరంచెయ్యాలి.

ఆ తెల్లవారే నేను ప్రయాణమైనాను. అప్పటికింకా ప్రొద్దుపొడవలేదు. పుష్కలంగా డబ్బుతీసుకుని... ఒంటరిగా—కాలినడకను—చేలగట్ల వెంబడి—చుట్టూ చూశాను. ఎవరూ లేరు. ఆగి—పదసవ్వడికొరకై వీనులప్పగించి... లేదు. దిట్టపడ్డగుండెతో... తిరిగి నడక ... తూరుపు ఎరుపు. ... మంచు పొత్తిళ్ళలో ఉదయం గడ్డిపూల పరిమళం. ఉరుదరీ కుహర సుప్తోత్థ శార్దూలముల్ ఝురవారి శోణితశంకద్రావ, అటుదిటుతిప్పి... నా ఉత్సాహం విరిగిపోయింది. అతను నా వెనకనే వొస్తున్నాడు. కొంచెందూరంలో ఉన్నాడు. నిలబడ్డాను. అతనూ ఆగాడు... నా ప్రయాణం అతని కెట్లా [illegible] ఎవరు చెప్పారు? ఎవరికీ తెలీదుగదా ఈ విషయం?

ఈవిధంగా అతను చాలాకాలంనుండి నన్ననుసరిస్తున్నాడు. [illegible]రి అతను చాలా తమాషాలు చేసేవాడు. ఒకసారి బహుదీర్ఘంగా కనిపిస్తాడు. గజంకడుపు, మూడు గజాలకాళ్లు. ములుకోల్లల్లా చేతులు. అర్ధగజం తల. ఇంకోసారి మరుగుజ్జు. గలివర్ వర్ణించిన ఆరంగుళాల పరిమాణంలో ఉంటాడు. ఒక మధ్యాహ్నం పెద్దకత్తి తీసుకొని, అతనికోసం ఎదురుచూస్తూ కూచున్నాను. అరగంట గడిచినా అతని

జాడేలేదు. ఈమనిషికి మందు-కత్తిగదా అనుకున్నాను ఇః ఏక్షణమూ కత్తిని విడచి ఉండకూడదని నిశ్చయించుకున్నాను. సాయంత్రం బజారుకొస్తుంటే అతను కనిపించాడు. ధైర్యంతో కత్తి చివ్వనలాగాను. అతనూ అదేపని చేశాడు. నాకు గుండె చాలిందికాదు. ఈయుద్ధంలో ఒకవేళ నేనే చనిపోతే! చావటం బొత్తిగా యిష్టంలేదునాకు. జీవించి అనుభవించవలసిన వనేకం ఉన్నాయి. ఈ ముష్టివెధవకోసమని నేను నా అనుభవాలను వొదులుకోలేను... ఐనా అతన్ని చంపటంగూడా అనవసరమే! అతనివల్ల నాకే అపాయమూలేదు. ఉట్టినే నన్ను వెంబడిస్తున్నంతమాత్రాన నాకు పోయేదేమున్నది గనక? ఒకవేళ ఏ పురాతన దేవతలో బంధువులో, మిత్రులో...

ఇది కొంతకాలంక్రిందటి సంగతి. అప్పటినుండీ అతను నన్ను వెంటాడుతూనేవున్నాడు. అతన్నుండి నేను తప్పించుకోవాలని ప్రయత్నం చేస్తూనే ఉన్నాను. ఇటీవలే అతనెవరో నేను తెలుసుకోగలిగాను. ఎందుకు నన్నిట్లా అనుసరిస్తున్నాడోకూడా గ్రహించాను. అతన్ని... పుస్తకంలాగా చదివెయ్యగలను. అతనంటే ... కూడా లేదు. అతనెవరంటారా? చెప్పను. ఎప్పటికీ చెప్పను. ఇపటికే మీలోకొందరు, అతన్నిగురించి తెలుసుకొని ఉంటారని నా నమ్మకం. లేదా ఇకముందు తెలుసుకొంటారు.